శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

**Journal of the Telugu Academy**
**KAKINADA**



దేశభాషలందు తెలుగు లెస్స

సంపుటము ౫౦
Vol 50

సంచికలు 3-౪
Parts III & IV

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

స్థాపకులు:
శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు:
శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు
శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు
శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు

ఉద్ధారకులు:

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు
(జమీందారు, ఉయ్యూరు ఎస్టేటు,)

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

**Journal of the Telugu Academy**
**KAKINADA**
సంవత్సరము చందా 3—0—0

సంపుటము ౫౦ ప్లవ-శ్రావణ భాద్రపదములు సంచికలు ౩-౪
Vol 50 ఆశ్వయుజ కార్తికములు Parts III & IV

## స్వ వి ష య ము.

నేటి కేఁబదియేండ్లనుండి, గ్రాంథికాంధ్ర భాషాసేవను జేయుచున్న ఆంధ్రసాహిత్యపరిషత్తు, ఏదో యొకవిధమునఁ దన యస్తిత్వమును నిలుపఁబెట్టుకొనుచు వచ్చుచున్నది. ప్రాచీన భాషాగ్రంథములను విరివిగఁ బరిశీలించి, ఉత్తమసాహిత్యము నార్జించుకొనవలెనను నుత్సాహము, ఆంధ్రపాఠకలోకమున నానాఁటికిఁ దఱుగు చూపుచున్నది. యువకులలో మన ప్రాచీన భాషాగ్రంథములపై నభిమానము హెచ్చి, భారతాదులను శ్రద్ధతోఁ జదివిననాఁడుగాని, వారికుత్తమ విజ్ఞానము జాతీయాభిమానము మొలతేరదు. అట్టి యవకాశము కలిగించుటకై పరిషత్సంస్థ సర్వవిధముల సహకరింపఁగలదు. దాని పురోభివృద్ధికి ఆంధ్రభాషాభిమానులైన యుదారులు సహకరింపవలసి యున్నది. ఈవత్సరమునఁ బరిషత్తునకు స్వర్ణోత్సవము జరుగవలసి యున్నది. దానికి ఆంధ్రలోకము సహకరించుఁగాతమని ప్రార్థన.

ఇట్లు,
సంపాదకుఁడు.

విషయసూచిక







# క్రీడాభిరామపాఠములు; రచనము

(శ్రీ బండారు తమ్మయ్య)

క్రీడాభిరామము శ్రీనాథమహాకవికి సమకాలీనుఁడు, విజయనగర రాజుల యుద్యోగియునగు వినుకొండ వల్లభరాయని పేరఁ దత్కృతముగా వెలసిన వీథినాటకము దీని తాళపత్ర ప్రతి శిథిలాతి శిథిలమయినది యొక్కటి మాత్రమే తంజావూరు సరస్వతీ మహాలు లైబ్రరీలో నుండఁగా దానిని బట్టి యీ గ్రంథమును దొలుదొలుత 1909 సంవత్సరములో కీ॥ శే॥ శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు రు 0-5-0 లు స్వల్పమూల్యమేర్పఱచి తమ "విస్మృత కవుల సీరీస్" లోఁ బ్రథమ పుష్పముగాఁ బ్రకటించియున్నారు. రెండవ ప్రతాపరుద్రుని నాఁటి యోరుగంటి నగరస్థితిని, సాంఘిక పరిస్థితులను బ్రకటించునది కావున నీ క్రీడాభిరామమునకుఁ జారిత్రకముగ విశిష్టమయిన స్థానమున్నది. అందుచే నీ గ్రంథమును తంజావూరు లైబ్రరీయందలి యేకైక శిథిల ప్రతినే మరలఁ బరిశోధించి, రామకృష్ణకవిగారు ప్రకటించిన పాఠములు కొన్నిటికి సవరణలు ప్రతిపాదించి కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 1929 సంవత్సరములో మదరాసులో శ్రీ గంటి సూర్యనారాయణ శాస్త్రిగారి శృంగార గ్రంథమాలికలోఁ జక్కఁగా ముద్రించి ప్రకటించి నారు. ప్రభాకరశాస్త్రిగారి పరిశోధనకాలముననే తంజావూరు నందలి తాళపత్ర ప్రతి తునాతునకలయి యక్షరములు పదములు సరిగా గుర్తింపరాని స్థితిలోనుండియున్నవి. ఈ పునర్ముద్రిత ప్రతికిఁ బ్రకాశకులు, "ప్రాజ్ఞులకుఁ బండితులకు మాత్రమే ప్రమాణపత్రముతోఁ బదిరూపాయల మూల్యము పంపిన యెడలనే పుస్తకము పంపఁబడును" అనర తాబంధముతోఁ గూడిన నిబంధనము కల్పించుటచే నీ ముద్రణప్రతులు పలువురకు దుర్లభమయినవి. ప్రభాకరశాస్త్రిగారు గ్రంథ పీఠికలో విశేష శ్రమతోఁ దాళపత్ర ప్రతిని బరిశోధించి సరి

నైన పాఠములను గుర్తించితిమని వ్రాసియున్నారు. కాని వీరి పునర్ముద్రణ పాఠములు కూడఁ గొన్ని యెడలఁ గవిపాఠములు కావేమోయను సందియముల కెడమిచ్చుచుండుట చేతను వారేర్పఱచిన గ్రంథమూల్యము మిక్కిలి యెక్కువగ నుండుటచేతను నీ గ్రంథమునందఱకందుఁబాటగునట్లిప్పటి పరిస్థితుల కనుగుణముగ సరసమయిన మూల్య మేర్పఱచి పునర్ముద్రణము గావించు నావశ్యకతను హెచ్చరించుచు దాని నిర్వహించు ముద్రాపకుల యుపయోగమునకుఁ బర్యాలోచనమునకుఁగాను గొన్ని పాఠములను గూర్చి చర్చించుచు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సం 40 సం 4-6 లో “క్రీడాభిరామ పాఠములు” అను పేరుగల వ్యాసమొకటి ప్రకటించియున్నాను. దానిని జూచిన మీఁదట భాషోద్ధారకులు కీ॥ శే॥ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారు, తాముట్టి చవుక ముద్రణము ( Popular edition ) గావింతుమని నేను సూచించు పాఠములతోఁ దమకుఁ దోడ్పడవలసినదని నాకు వ్రాసియున్నారు. తదనుగుణముగ నీ గ్రంథమును వారు నా పరిష్కరణముతోఁ బీఠికతో రు 1-8-0 లు మూల్య మేర్పఱచి 1953లోఁ బ్రకటించియున్నారు. ఈ ముద్రణములో నాయా పద్యములలో నేఁ గయికొనిన క్రొత్త పాఠములకుఁ బుటలయడుగున రామకృష్ణ కవి గారియుఁ బ్రభాకర శాస్త్రిగారియుఁ బూర్వముద్రణ పాఠములను కూడఁ గనబఱచి పాఠకులాయా పాఠ భేదముల యౌచిత్యా నౌచిత్యములఁ దామే పర్యాలోచించి తమ కుచితములని తోఁచిన పాఠములనే గ్రహింపఁదగునని ప్రార్థించియుంటిని. సందేహాస్పదములుగ నున్న పాఠములింకను మఱికొన్ని యున్నను గవిహృదయ మిదమిత్థముగ నిరూపింపఁ జాలమి వానికి మార్పులు సూచింపనైతినని కూడ నా పీఠికలో వ్రాసి యుంటిని. పూర్వముద్రణ పాఠముల నేనే మాత్రము నిర

సించలేదు. వానిని గూడఁ బుటలయడుగునఁ బ్రకటించి పాఠకుల యుచితజ్ఞతకే యన్నిటిని విడిచిపెట్టితిని. ఇందుచే నా సదుద్దేశమును సహృదయులు గ్రహించియే యుందురని నా విశ్వాసము. 1929 సంవత్సరము ముద్రణానంతరము, శ్రీ ప్రభాకరశాస్త్రిగారి నిర్యాణము తరువాత మరల నీ గ్రంథమును ముక్త్యాలలోని శ్రీప్రభాకర పరిశోధక మండలివారు 1952 సంవత్సరములోఁ బూర్వ ముద్రణమును బట్టియే ప్రభాకరశాస్త్రిగారి యొకటి రెండు వ్యాసాంతరములను అనుబంధములుగాఁ జేర్చి ప్రకటించియున్నారు అనంతరము మరల 1960 సంవత్సరములో దీనికే ప్రభాకరశాస్త్రిగారి కుమారులు శ్రీ ఆనందమూర్తి గారు మఱియొక వినూత్న ముద్రణమును స్వరచితమయిన పీఠికానుబంధమును, గ్రంథాంతమునఁ గొన్ని పద్య గద్య సూచికలను, "పరిష్కర్తలు-పాఠభేదములు" అను శీర్షికతోడి పట్టికను జేర్చి ప్రకటించినారు. దీనికిఁ గూడ వారు రు 10-0-0 లు మూల్యము నేర్పఱచియున్నారు. కొన్ని చిత్రపటములతో విశేషాంశములు, సూచికలుతో నిది పూర్వముద్రణము లన్నిటికన్న శోభాయమానముగ నున్నదనుట కెట్టి సంశయము లేదు. "పరిష్కర్తలు, పాఠభేదములు" అను శీర్షిక క్రింద; గ్రంథాంతమున వీరు రామకృష్ణకవిగారి ప్రభాకరశాస్త్రిగారి వావిళ్ళవారి పూర్వముద్రణములందలి పాఠభేదముల నెల్ల నొక్కచోఁ గనఁబఱిచియుండుట ముదావహము. తాము స్వయముగ రచించిన పీఠికానుబంధములో వీరు తమ తండ్రిగారి ముద్రణ పాఠములకు నేను గావించిన మార్పులన్నియుఁ గూడ ననవసరములని నిరూపించుటకు యత్నించి తమ పితృభక్తిని లెస్సగాఁ బ్రదర్శించిరి. వీరి పితృభక్తి యెల్లరకభినందనీయమనుటకు సందియము లేదు. నా సూచనలన్నియుఁ బాఠకుల పర్యాలోచనార్థమే కావింపఁబడినవని యందలి యౌచిత్యా

నాచిత్యములఁ బరిశీలించి యుచితమయిన పాఠముల గ్రహించు బాధ్యత పాఠకులకే విడిచిపెట్టితినని ముందే మనవిచేసియున్నాను. ఇప్పటికి నావాంఛితమదియే యని నొక్కి చెప్పుచున్నాఁడను. అయినను పాఠకుల సమీక్ష నిమిత్తమే శ్రీ యానందమూర్తిగారి సమర్థనముల విషయమించుక ముచ్చటించుచున్నాను.

(1) గ్రంథావతారికయందలి 23 పద్యము

సీ॥ మూఁడు-గ్రామగ్రాసములతోడఁ గూడంగ
మోపూరుఁ బాలించె ముల్కినాట
నాశ్వలాయన శాఖయందు ఋగ్వేదంబు
కరతలామలకంబుగాఁ బఠించెఁ
బ్రత్యక్ష మొనరించి భైరవస్వామిచేఁ
సిద్ధసారస్వత శ్రీవరించెఁ
గామకాయనస విశ్వామిత్ర గోత్రంబు
వంశ గోత్రంబుగా వన్నెకెక్కె

నెవ్వఁడా త్రిపురాంతకాధీశ్వరునకు
రాయనవరత్నభండార రక్షకునకుఁ
బ్రియతనూజుండు చందమాంబికకు సుతుఁడు
మనుజమాత్రుండె వల్లభామాత్యవరుఁడు

అను సీసపద్యమునందలి విశేషణములన్నియు నెత్తుగీతి మూఁడు నాలుఁగు పాదములలో నుదాహృతుఁడయిన కృతికర్త వల్లభామాత్యునకే వర్తించునని శ్రీ రామకృష్ణకవిగారు, ప్రభాకరశాస్త్రిగారు తలంచియున్నారు. అది సరికాదని యా విశేషణములన్నియు నెత్తుగీతి మొదటి రెండు పాదములందు వ్యవధానరహితములైన యర్థవర్థక శబ్దములచే నిర్దిష్టుఁడయిన వల్లభరాయుని తండ్రి త్రిపురాంతకు

నకు (తిప్పనకు) వర్తించునని, తాతతండ్రుల యుద్యోగములు వారి యనంతరము వల్లభరాయనికి సంక్రమించియుండునని నేను 1932 సంవత్సరములో ఆంధ్ర పత్రిక సారస్వతానుబంధములోఁ బ్రకటించిన "క్రీడాభిరామము, శ్రీనాథునకు దానితో నున్న సంబంధము" అను వ్యాసమును బ్రకటించిన నాఁటినుండియుఁ జెప్పుచునేయున్నాను. వల్లభరాయని తాతతండ్రు లిరువురు గూడఁ దిప్పనామాంకితులే. తాత తిప్పన మల్లనపుత్రుడు. అతఁడు హారీతగోత్రుడగు తిప్పన తనయ పెద్దమాంబ నుద్వాహమయ్యెను. ఆసంగతి.

> "తిప్పమంత్రి జగదుదీర్ణవిఖ్యాతి తీర్ణుఁడు
> నుద్వాహమయ్యె నధిక వైభవమున
> హారీతగోత్ర జలధి హారిణాంకుఁ డగుతిప్ప
> నార్యతనయఁ బెద్దమాంబ నెలమి"

అను 15 పద్యమున గ్రంథావతారికయందు స్పష్టముగాఁ జెప్పఁబడినది. ఈ పద్యము తరువాత 16, 17, 18, 19, 20 పద్యములలో నీతిప్పన్న వైభవ ప్రాభవములు, పరాక్రమములు, రాజకార్య ధురంధరత, గుణవిశేషములు విశేషముగా వర్ణితములయి యీతఁడు వీరహరిహర రాయ రత్న భాండారాధ్యక్షుఁడు, వినుకొండ దుర్గాధ్యక్షుఁడునని పేర్కొనఁబడినాఁడు.

> "గంధవతీప్రవీరపుర ఘస్మరపాద విసర్పిసూనపు
> ష్పంధయ చక్రవర్తి ప్రుత పర్వతదుర్గ మహాప్రధానరా
> డ్గంధ గజంబు తిప్పనయఖండిత ధీనిధి కాంచెఁ బుత్త్రిలన్
> బాంధవకల్ప వృక్షముల బైచన మల్లన తిప్పమంత్రిలన్

అను 20 పద్యములో నీతనికి బైచన, మల్లన, తిప్పన అను మూవురు పుత్త్రిలు గల్గినట్లు స్పష్టముగాఁ జెప్పఁబడినది. తండ్రి

మల్లన పేరే రెండవకుమారున కాతఁడు పెట్టినట్లున్నది. ఆ తరువాత "అందు" అను వచనము చేర్చి యావెను వెంటనే పూర్వోక్తమయిన "మూఁడు గ్రామ గ్రాసముల" అను సీసపద్యము చెప్పఁబడినది. ఈ పద్యములన్నియు సక్రమముగాఁ జదివి యర్థము దెలిసికొనువారికి వల్లభరాయని తాత తిప్పన మూవురు పుత్రులలోఁ గడపటివాఁడగు తిప్పనయే సీసపద్యము నెత్తుగీతి ప్రథమ పాదములో యచ్ఛబ్ద తచ్ఛబ్దములచే నిర్దిష్టుఁడయిన శ్రీపురాంతకాధీశ్వరుఁడనియు నాతఁడే తండ్రి యనంతరము రాయనవరత్న భండార రక్షకత్వ పదవిని బడసియుండు ననియు నాతనికిఁ జందమాంబిక వలనఁ గృతికర్త వల్లభామాత్యుఁడు ప్రియతనూజుఁడుగా నుదయించెననియు స్పష్టముగా బోధపడుననుట చెప్పనక్కఱలేదు. కాని ప్రభాకరశాస్త్రిగారు వల్లభరాయని తాత తిప్పననే తండ్రి తిప్పనగా గ్రహించి మదరాసులో శృంగార గ్రంథమాలికలో 1929 లోఁ బ్రకటితమయిన క్రీడాభిరామములోఁ దమ యుపోద్ఘాతారంభమున వల్లభరాయని వంశవృక్షమును లిఖించి యావెంటనే "కృతికర్త యగు వల్లభుని తండ్రి తిప్పయ తనకు మూఁడు గ్రామములు సర్వభోగముగాఁ జెల్లగా, ములికినాటిలోని మోపూరిఁ బరిపాలించెను" అని వ్రాసి యాతని పుత్త్రులలో రెండవవాఁడుగాఁ జెప్పబడిన మల్లన యనునది "వల్లభ" యనుటకుఁ బొరపాటుగా వ్రాయఁబడెనేమో యని (తాము పొరపడి) వంశ వృక్షమందలి మల్లన యను పేరిక్రింద (వల్లభ ?) అని కుండలీకరించిరి. దీని కంతకు మూలము "సీసము నాల్గుచరణములను క్రియాన్వితములగు వాక్యములుగాఁ జెప్పి యెత్తుగీతిని యత్తదర్థకశబ్దములతో నుపక్రమించి పూర్వచరణములతో నన్వయము ఘటించుట శ్రీనాథుని క్రొత్తగడుసరి కూర్పు నేర్పు" అనెడివారి యభిప్రాయము. ఇట్టి విన్యాసము వంశకర్త విశ్వామిత్రుని గూర్చిన గ్రంథావతారికలోని

సీ॥ అఖిల ప్రపంచంబు నన్యథా కల్పించెఁ జతురోక్తి రేఖసాఫల్య
మొంద

... ... ...

గీ॥ నెవ్వడాతండు సామాన్య ఋషియెతలఁప అనెడి మొదటి పద్యమునందే కానవచ్చి సూచియుఁ జూడఁగ నేయిది శ్రీనాథకృతియై యుండెననెడి యనుమానమును వారికిఁ గలిగించెనఁట. మఱియు నిట్టి విన్యాసమే కాశీఖండ షష్ఠాశ్వాసమున నొక పద్యపు టెత్తుగీతిలోఁ (ఆ 6-46) గలదని వారు లిఖించిరి. ఇందుచే నిట్టి పదవిన్యాసముతోఁ గూర్పఁబడిన "మూఁడుఁ గ్రామ గ్రాసములతోడఁ గూడంగ మోపూరుఁ బాలించెము లికినాట" అను సీసము నాల్గు పాదములలోని క్రియాన్విత వాక్యములన్నియు నెత్తు గీతి చివరిపాదములలో నుదాహృతుఁడయిన కృతికర్త వల్లభామాత్యునికే వర్తించుననెడి యభిప్రాయము నాలంబించి యందుకు సమర్థకముగా నాతని తాతను దండ్రిగాఁ జేయుటకే గాక యాతని పెదతండ్రి మల్లననే యాతనిగాఁ జేయుటకుఁ గూడ సాహసించిరి. తండ్రిగారి యడుగుఁ జాడలలో నడిచి వారి వ్రాతల నెల్ల సూచముట్టుగ నిలువఁ బెట్టనెంచిన వారి కుమారులు శ్రీ యానంద మూర్తిగారు కూడఁ బ్రభాకరశాస్త్రిగారి నిర్ణయమును దాము గూడ నీ ప్రస్తుత ముద్రణమునందును సమర్థించుట కెన్నియో రీతులఁ బాటు పడినారు. ఇట్లు సీసపాదములలోఁ గ్రియాన్వితములుగానున్న విశేషణము లన్నిటిని నెత్తుగీతిలో యుత్తరార్థక శబ్దములతోడి యుపక్రమముతో నుదాహృతుఁడయిన వ్యక్తికి సమన్వయింపఁ జేయుట శ్రీనాథుని యపూర్వమార్గమని యభిప్రాయపడిన ప్రభాకరశాస్త్రిగారు, అందు కనుగుణముగా సీసము మొదటి పాదములో మూఁడు గ్రామగ్రాసముల భోగముతో మోపూరును బరిపాలించిన వాఁడు వల్లభరాయని తండ్రి

తిప్పన యని యుపోద్ఘాతారంభమున వ్రాసియుండియు నందుకు భిన్న ముగ మరల నాయా విశేషణములు వల్లభరాయనికే వర్తించునని తలంచుట, యందుకై యాతని తండ్రి తిప్పనను తాత తిప్పనగా మార్చు టయుఁ బెదతండ్రి మల్లన నాతనిగానే మార్చి వేయుటయు నెంతవఱకు సమంజసములో లోకమే నిర్ణయింపఁదగును. యచ్ఛబ్దవిశేషణములను దత్పున్నిహితముగఁ దచ్ఛబ్దముచే నిర్దిష్టుఁడయిన వ్యక్తికే వర్తింపఁ జేయుట యొక్క శ్రీనాథుని మర్యాదయే గాదు సకల కవుల పరిపా టియు నదియే. క్రీడాభిరామమందలి విశ్వామిత్ర వర్ణనాత్మకమయిన పద్యము నెత్తుగీతి, "మూఁడు గ్రామగ్రాసములతోడ—" పద్యము నెత్తుగీతి, ప్రభాకరశాస్త్రిగారు తమ యుపోద్ఘాతములోఁ బద్యసంఖ్య సూచించి విడిచిపెట్టఁగా ఆనందమూర్తిగారు పూర్తిగా నుదాహరించిన కాశీఖండపద్యము(ఆ6 ప 46) నెత్తుగీతియు నొకేతీరుతోడి యన్వయ క్రమము గలవి కావు. మొదటి పద్యములో "ఎవ్వఁడాతండు సామాన్య ఋషియె తలఁప" అనెడి యెత్తుగీతి ప్రథమపాదములో యచ్ఛబ్దము వెనువెంటనే, యాతండు అను తచ్ఛబ్దముచేతను ఋషిశబ్దముచేతను విశ్వామిత్రుఁడు సూచింపఁబడి తరువాతి మూఁడుపాదములందు తాటకా కాళరాత్రికి దాశరథికిఁ గాలకంధరకోదండ ఖండనునకుఁ గావ్యకా చార్య మగునంతు గాధిసుతుఁడు" అని వర్ణింపఁబడినాఁడు. మధ్యనున్న రెండు మూఁడు పాదములలో విశ్వామిత్రుని శిష్యుడు శ్రీరామునికి విశేషణములు షష్ఠీవిభక్తి ప్రత్యయములలోఁ గూర్పఁబడినను వాక్య మునకు గర్తయైన యాతఁడు గాధిసుతుఁడని ప్రథమావిభక్తినేలో చెప్పఁబడినది. ఇఁకఁ గాశీఖండ పద్యవిషయముఁ జిత్తగింపుఁడు. దుర్గుణ భూయిష్ఠుఁడగు నొకయధమ విప్రుఁడు దారి నేఁగుచుండఁగా వాని యవగుణముల నవకాశముగఁ జేసికొని ప్రక్కనున్న రావిచెట్టునుండి

తాను వాని నావహించితినని యొక బ్రహ్మరాక్షసుఁడు చెప్పు మాటలివి.

సీ॥ మాటలాడుచు మూత్రమలము లుత్సర్జించు మిహిరోదయమ్మున
మేలుకొనఁడు

. . . . . . . . .

గీ॥ నెవ్వఁడవ్విప్రదాయాదుఁ డేఁగుఁ దెంచె మార్గవశమునఁ గార్యసామగ్రి కలిమి నాశ్రయించితి నతని మధ్యాహ్నవేళఁ బ్రాంత దేశంబు నందొక్క రావినుండి" ఇందు సీసపద్యపాదముల వర్ణితము లయిన దుర్గుణముల కాశ్రయుఁడయిన వాఁడు బ్రాహ్మణబ్రువుఁడు. ఎత్తుగీతి ప్రథమ పాదములోనే ప్రప్రథమముననే యాతఁడు యత్తదర్థక శబ్దములచే నుదాహృతుఁడయినాఁడు. మూఁడునాల్గు పాదములలోఁ జెప్పఁబడిన బ్రహ్మరాక్షసునకు సీసపాదములందలి విశేషణము లేవియు వర్తింపఁజాలవు. ఇఁకఁ బ్రస్తుతము మనవివాదమునకుఁ బ్రసక్తమయిన "మూఁడు గ్రామ గ్రాస—" అను సీసపద్యమునందలి విన్యాసమును విమర్శించి చూతము.

సీసపాదముల వెనువెంటనే యెత్తుగీతి ప్రథమపాదములోనే "యెవ్వ" డను యచ్ఛబ్దము వెన్నడి "ఆ త్రిపురాంతకాధీశ్వరునకు" అని చెప్పఁబడుటచే శ్రీనాథుని పద్ధతి ననుసరించియే సీసపాదములందలి క్రియాన్విత విశేషణములన్నియు నాతనికే వర్తించుననుట సహృదయుల కెల్ల విశదమే. "ఆ త్రిపురాంతకాధీశ్వరునకు రాయనవరత్నభాండార రక్షకునకు" అనుషష్ఠీవిభక్తి ప్రత్యయములుచేర్చుటయిందుకే మాత్రము బాధకము కాఁజాలదు. "గంధవతీప్రతీర" అను 20 పద్యము తరువాత "అందు" అనువచనముండుటచే నా పద్యము నాలవపాదమునఁ జేర్పఁబడిన బైచన మల్లన తిప్పమంత్రిలలోఁ గడపటివాఁడే

యా త్రిపురాంతకధీశ్వరుఁడని తెల్లమగును. ఆతనికిఁ జందమాంబికవల ననుదయించిన తనయుఁడు కృతికర్త వల్లభరాయఁడని యెత్తుగీతి మూఁడు నాల్గు పాదములలోఁ జెప్పఁబడినవి. ఈ విషయములన్నియు సమాలోచింప వల్లభరాయని తాత తిప్పయ్య భార్య పెద్దమాంబ యనియుఁ దండ్రి తిప్పయభార్య చందమాంబయనియు వారు వేర్వేఱు వ్యక్తులనియు స్పష్టముగ గోచరించును. ప్రభాకరశాస్త్రిగారు పాఠపాటునవల్లభరాయని తాతను దండ్రిగను బెదతండ్రిమల్లసనాగనిగ ననుగ్రహించిరి గాని యాతని తాతతండ్రుల భార్యల నామములందలి భిన్నత్వమును గూర్చి యేమియుఁ జర్చింపరయిరి. కాని యాకొఱఁతను ఆనందమూర్తిగారు తీర్చినారు. చందమాంబ యనునది పెద్దమాంబయనుటకు గ్రంథమునఁ దప్పుగా వ్రాయఁబడియుండునని, తాత తిప్పన భార్య పెద్దమాంబ యొక్కయు నాతని తండ్రి మల్లన భార్య త్రిపురమ యొక్కయు జనకుల నామములు గ్రంథమునఁ జేర్కొనఁబడఁగాఁ గృతికర్తయయిన వల్లభరాయని తల్లిపేరు చందమాంబయే యైనచో నామె పుట్టింటివారి వివరములు గ్రంథమున నుదాహృతములు గాకుండుటకుఁ దగిన కారణములు లేవని, వీరు క్రొత్త యుపపత్తులతో వాదమునకు దొరకొనిరి. ఇట్టి వివరము లీ వంశమున నంతకంటెను బూర్వులగు చంద్రామాత్య, మంచనామాత్యుల భార్యలయిన పోచమాంబ, తిప్పమాంబల విషయమునఁ గూడ గ్రంథమునఁ జేర్కొనఁబడ లేదేమి యను నాక్షేపమును వారే శంకించికొని, వారు చాలఁ బూర్వులగుటచే నా వివరములు తనకుఁ దెలియకుండుటచేతనే గ్రంథకర్త వానినుదాహరింపమాని యుండు ననెడి సమాధానము గూర్చికొని సంతృప్తిఁ జెందిరి. ఇందుచేఁ దాము తమ పీఠికానుబంధములో మరలఁ గ్రొత్తగా లిఖించిన వంశ వృక్షములో వల్లభరాయని తాత తిప్పన (భార్య హరితగోత్రుఁడగు తిప్పన తనయ పెద్దమాంబ) అని చూపు

టలో పెద్దమాంబ నామము చివఁ గుండలీకరణములో (చందమాంబ?) యను ప్రశ్నార్థక చిహ్నముతో లిఖించిరి. దీనిని బట్టి వల్లభామాత్యుని తల్లిపేరు చందమాంబగాక పెద్దమాంబయే యని వారి నిర్ణయమయినట్లు స్పష్టమగును. అట్టిచో నంతకుముందు 15 పద్యమున వివరములతో నామె పేర్కొనఁబడియుండఁ బునరుక్తముగ నామెను "మూఁడు గ్రామగ్రాస..." పద్యము నెత్తుగీతిలో మరలఁ బేర్కొనవలసిన యవసరమేల కలిగెనను శంక యానందమూర్తిగారికిఁ గలుగకుండుట యాశ్చర్యమే-కృతికర్త వల్లభామాత్యుని తల్లి పెద్దమాంబయేయై యామెను మరలఁ బై పద్యమునఁ బేర్కొనవలసిన యవసరము లేనప్పుడు, "గంధవతీ ప్రతీర..." అను 20 పద్యము నాల్గవపాదములో నాతనినే యుద్దేశించి కవి "మల్లన" యని గాక "వల్లభ" యనియే వ్రాసియున్నచో నంతకు ముందీ వల్లభుని పినతాత వల్లభామాత్యుని గూర్చి లిఖించిన "తారకామందార తారావలంబుతో..." అను 12 పద్యము నెత్తుగీతివలెనే "మూఁడు గ్రామగ్రాస..." పద్యము యొక్క యెత్తుగీతి కూడ మఱొకవిధమున నుపక్రమింపఁబడి కేవలము కృతికర్త వల్లభరాయని గుణవిశేషములతోడనే కూర్పఁబడి యుండునని సహృదయులకుఁ జెప్పనక్కఱలేదు.

త. శ్రీ గారు భ్రమ ప్రమాదములకు లోనయి వ్రాసిన వ్రాత నెట్టిదయిన నిలఁ బరించుటకయి యానందమూర్తి గారెన్నెన్ని పరపల్లు ద్రొక్కినారో చదువరులకు వ్యక్తము కాఁగలదు. ఇంతకు గ్రంథమందలి పద్యక్రమమును బట్టి సహృదయులకు వాస్తవముగఁ దోఁచు యథార్థము వల్లభరాయని తాతతండ్రు లిరువురు కూడఁ దిప్పనామాంకితులని, వారి భార్యలు వరుసగ పెద్దమాంబ, చందమాంబలని "మూఁడు గ్రామగ్రాస ..." సీస పద్యపాదములందలి క్రియాన్విత విశేషణములన్నియు వల్లభరాయని తండ్రి తిప్పనకే వర్తించునని

తెలుపనుటయే నేను చెప్పునది. ఇప్పటికి నా విశ్వాసమిదియే. పాఠకులు సత్యమునే గ్రహింతురు గాక.

(2) కృతికర్త వల్లభామాత్యుని పినతాత వల్లభామాత్యుని (మల్లికార్జున పుత్రుఁడు) గూర్చి చెప్పుటలో 13 పద్యమునందలి యెత్తుగీతిలో "మల్లికార్జున మంత్రికి వల్లభునకు" అని వ్రాఁతఁ బ్రతిలో నున్నదఁట. ప్రభాకరశాస్త్రిగారు తమ ముద్రణములోఁ బయిపాదము "మల్లికార్జునసుతునకు వల్లభునకు" అని యుండఁదగునని సూచించిరి. వావిళ్ళవారి ముద్రణములో "మల్లికార్జున పుత్రుఁడు వల్లభునకు" అని ప్రకటించితిని. ప్రభాకరశాస్త్రిగారు సంస్కరించినట్లే విభక్తి మర్యాద నపేక్షించి "సుతునకు" అనియే యుండఁదగునని శ్రీరామానందమూర్తి గారు వ్రాసినారు. షష్ఠీవిభక్తిప్రత్యయములతో నిర్దిష్టుఁడయిన వ్యక్తి యొక్క విశేషణములు ప్రథమావిభక్తి ప్రత్యయములతోఁ గూర్చుట కూడ భాషాసంప్రదాయమే యనుట విజ్ఞులెఱింగినదే. "సుగుణగణాభిరాముఁడు రామునకు" ఇత్యాదులు చూచునది. వ్రాఁత ప్రతిలో నున్న "మంత్రికి" అనుపదములోని మధ్యాక్షరము రేఫసంయుక్తతకారములో నుండుటచేఁ గవి ప్రయుక్తమయినది "పుత్రుఁడు" అయియుండునని యూహించి నేనట్లు ప్రకటించితిని. ఎట్లున్నను నర్థము సంగతమేగదా.

(3) కథాప్రస్తావన రూపకముగ నున్న పద్యము.

"గతిరసికుండ! షట్చరణ! గానకళాకమనీయ! యోమధు
వ్రత! వికచారవిందవనవాటిక నేమిటికిం బరిత్యజిం
చితివట యీ ప్రదేశమునఁ జెట్టులు సేమలు నేమిగల్గినన్
బతిచెడి సంచరించెదవు ప్రాఁబడి పోయెనె నీ వివేకమున్"

అని ప్రభాకరశాస్త్రిగారి ముద్రణమున నున్నది. ఇది యోరుగంటిలో గోవింద మంచనశర్మ యింటగా నుండిన కామమంజరి యను పునర్భువు చిరకాలము దేశాంతరగతుండయి యేక శిలానగరమునకుఁ

దిరిగివచ్చుచున్న యాతని నుద్దేశించి యాముద్రియపుత్తెంచిన యసంబంధీభూత ప్రేమసంధుక్షణగర్భంబయిన వదనఖ సందేశపద్ధతి నాతని నెచ్చెలి యనుచరుడు నయిన టిట్టిభసెట్టి శరించుచున్నదని సూత్రధారుఁడు విని ప్రకటించినది. మధువ్రతమునకు (తుమ్మెదకు) వికచారవింద వనవాటికా విహరణమువలె మంచన శర్మకుఁ గామమంజరితోడి కూటమి యానందకరమైనదనియు నట్టి దానిని విడిచి యాతుమ్మెద యడవిలో నాసక్తితో జెట్టులఁ జేమలఁ జేరునట్టు తన్ను విడిచి యితరకాంతల మరగి యవివేకియై మంచన శర్మ విహరించుచుండెనని కామమంజరి గావించిన గర్హణమిందు గర్భితమైయున్నది. ఈ యర్థము పద్యము 3, 4 పాదములు ముద్రితమయిన విధానములోఁ బాఠకులకుఁ జక్కగాఁ బోధపడదని, "చెట్టులు సేమలు" నని ప్రథమా విభక్తిలో నుండుట సరిగాదని, పతిచెడి యను పాఠములోని భావము ప్రస్ఫుటముగా నుండదని "చెట్టులఁ జేమల నేమి గల్గునక్" అని ప్రథమా విభక్తిలోనున్న వానిని ద్వితీయలోను "పతి చెడి" అను దానిని "రతి (నాసక్తి)నిటు" అని మార్చి నేను ప్రకటించితిని. ఈ మార్పు లనవసరములని, తాళప్రతిలోనున్న పాఠమున కర్థముకుదురుచు నేయుండ దిద్దనేల యని, "పతిచెడి" శ్రీనాథకవి ప్రయుక్తపదమని, సంస్కారము తగదని, శ్రీయానందమూర్తిగారు నామార్పు గూర్చి యాక్షేపించినారు. "పతిచెడి" యను ప్రయోగము నే యర్థమున శ్రీనాథుఁ డెచ్చటఁ వాడెనో వారు చూపలేదు. నేను సూచించిన "చెట్టులఁ జేమల" నని ద్వితీయలోనుండుటయే సమంజసమని శ్రీతిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు (ప్రభాకరశాస్త్రిగారి ప్రియశిష్యులు) ఆనందమూర్తిగారి ముద్రణము పయి భారతిలోఁ బ్రకటించిన సమీక్షయందు దాహరించినారు నా సవరణలు కేవలము పాఠముల కర్థస్ఫురణ మగుటకుఁ జేయఁబడినవే గాని మఱొకటిగాదు.

4. మంచనవింటివో వినవొ మన్మథుఁ డేక శిలాపురంబులోఁ
జంచల నేత్రలంబతుల శయ్యలపై రతికేళి రాత్రిఁబో
రించి ప్రభాతకాలము పరిస్ఫుటమైనను దమ్మదారవ
ట్టించుచు నున్న వాఁడిదెకుటీగత కుక్కుట కంఠకాహళిన్ (ప. 54)

అను పద్యములో "దమ్మదార" యనునది తమ తండ్రి గారు ప్రకటించిన ప్రకారము "ధర్మదార" యని యుండుటయే యొప్పని యానందమూర్తి గారి యాశయము. ధర్మశబ్ద ప్రాకృత రూపమే "దమ్మ". బుద్ధ భగవద్రచిత ధర్మగ్రంథమునకు "దమ్మపద" మను రూపమునే ప్రభాకరశాస్త్రిగారు గ్రహించియున్నారు. పయిపద్యములో మానవల్లి రామకృష్ణకవిగారి ప్రథమ ముద్రణములో "ధమ్మదార" యనియున్నది "ధమ్మ" అనునది "దమ్మ" యనుటకు ముద్రాప్రమాదమైయుండును. "ధర్మదార" అను మిశ్రసమాసము కన్న "దమ్మదార" అను నాచ్ఛిక సమాసమే కవి ప్రయుక్తమయి యుండుననుట సమంజసము. పద్యము నాలవపాదము చివరనున్న "కాహళి" యను దానిని ప్రభాకరశాస్త్రిగారు తమ ముద్రణములో "నాళముల్" అని మార్చినారు. అప్పుడర్థము క్లిష్టమగును. కుక్కుట కంఠమే "దమ్మదార" గానుపచరించిన "కాహళి" కావున రామకృష్ణకవిగారు గ్రహించి ముద్రించినదేసరి. తమ పునర్ముద్రణములో శ్రీ యానందమూర్తిగారు తండ్రిగారి సవరణమును బరిహరించి పూర్వ ముద్రణ పాఠమునే గ్రహించుట ముదావహము.

5. పటుఝంఝాపవనోత్తృణాలయములో భద్రంబుగాఁ బక్షికం
కటిపై ముచ్చుముడింగి నిర్భర వియోగగ్లాని శోషించియె
క్కటి నిద్రించుచు నున్న వాడ (పాథ) వనితన్ గర్జావచఃప్రౌఢిమన్
దటిదుద్యోతము సూపునట్టనడురే ధారాధర శ్రేణికిన్ (ప 60)

ఈ పద్యము శ్రీనాథుని శాలివాహన సప్తశతి నుండి క్రీడాభిరామమున నుచిత స్థలమున శ్రీనాథునిచేఁ జేర్పఁబడియుండునని తలంచుచున్నారు. రామకృష్ణకవిగారు, ప్రభాకరశాస్త్రిగారు, నేను పద్యము నిట్లు ముద్రించితిమి. ప్రాకృత భాషయందలి శాలివాహన సప్తశతి లోని దీని మూలమునకు ఛాయ.

"ఝంఝా వాతోత్తృణితే గృహేరుదిత్వావిస్నహనిషణ్ణామ్
దర్శయతి గతపతికాం విద్యుదుద్యోతో జలధరాణామ్"

ప్రభాకరశాస్త్రిగారి ముద్రణ పీఠికలోనిందుఁ గూర్చి కావించిన వివరణమంత సుగమముగా విస్పష్టముగా లేదు. వావిళ్ళవారి ముద్రణము పీఠికలో నేనిందుఁ గూర్చి కొంత చర్చ గావించి, "జలధరాణామ్" అను దానికి "ధారధరశ్రేణికిన్" అని కిమస్థితోడి యను వాదము మూలానుగుణమగునా? గర్జావచః ప్రౌఢిమతో మెఱపు కాంతి యావనితను జలధరములకుఁ జూపుటయేమి? యని శంకించి జలధరాణామ్ (జలధరముల యొక్క) తటిదుద్యోతము, గత పతికాం పాంథవనితను, దర్శయతిలోకమునకుఁ (బయటివారికి) గన్పడఁజేయును. అనుట శ్లోకభావమయి యుండునేమోయని యూహించి గర్జవచః ప్రౌఢి మత్తటి దుద్యోతతేఁ జూపునట్ట నడురే ధారాధర శ్రేణికల్" అని చివరిభాగమును మార్చుట మూలశ్లోకభావానుగుణంబుగ నుండునేమో యను సూచన గావించితిని. ఆనందమూర్తిగారు నేనుబలాటపడి చూపిన యీ సూచన కేవలము వ్యర్థప్రయాసయని హేళన మొనర్చిరి. నా యభిప్రాయమును సూచించితినే గాని యిట్టి సవరణతో నేను పద్యమును మార్చి గ్రంథమున ముద్రింపలేదు గదా! ఈ విషయమున నాకుబలాటము లేదు చరలాటము లేదు. దర్శయతి- చూపునది యెవరికయినఁ గావచ్చును. ఆ స్థితిలో దారి నేఁగువారికామె గానవచ్చుట ప్రకృతిసిద్ధము గాలిపెట్టుచేనింటికప్పెగిరిపోయి చలిచే బాధ

పడుచు నామె విచారించుచున్నది గాని యప్పుడు మెఱపులతోఁ గూడిన యామేఘములు జోరుగా వర్షము గూడఁ గురియుచున్నచో నా యింటిలోఁ దడియుచు నామె మంచముపయి భద్రముగా శయనించుట కనువగునా! ప్రక్కవారియింటిలో నెచ్చట నైనఁ దలదాఁచుకొన యత్నించదా? అప్పుడామెకుఁ గలిగిన యపకృతి ప్రభంజనుని వలననే గాని పర్జన్యునిచేఁ గాదు. ఈ సందర్భమున శ్రీయానందమూర్తిగారు మృచ్ఛకటికమునుండి "యది గర్జతివారి ధరో గర్జతుతన్నామ నిష్ఠురాః పురుషాః అయి విద్యుత్ప్రమదానాంత్వమపిచ దుఃఖం నజానాతి అను శ్లోకమునుదాహరించి, మేఘుఁడు పురుషుఁడు విద్యుత్తు స్త్రీ గనుక నాఁడు వారి గోడు వారికే తెలియునుగాని మగవారికేమి తెలియునని జాలిపడి మేఘములకే మెఱపులామెను జూపుచున్నవను భావమే సమంజసమని సమర్థింపఁబూనిరి. మృచ్ఛకటిక శ్లోకమున విద్యుత్తుకు మేఘమునకు స్త్రీ పురుష సామ్యములు వాచ్యముగ నా శ్లోకవిషయమునఁ జెప్పఁబడినవి గనుక నట్టి భావములు నర్థముఁ జెప్పనగును గాని క్రీడాభిరామ పద్యమునఁ గూడ నట్టివి చెప్పఁజూచుటలో సారస్యము లేదనియే నేనిప్పటికిఁ దలంచుచున్నాను. విద్యున్మేఘములకు జన్యజనకత్వము ప్రకృతిసిద్ధము. లోకము తమకుఁ దోఁచిన విధమున యథార్థమును గ్రహింపఁదగును.

(5) సూర్యోదయ వర్ణనము 63 పద్యములో నిట్లున్నది.

"అదె మాణిక్యపుఁ బూర్ణకుంభము వయస్యా! కార్యసంసిద్ధికై
మొదలం దోఁచిన యట్టి మంచిశకునంబుంగా విచారింపరా
యుదయం బయ్యెడు భానుబింబము దిశావ్యోమావకాశంబులన్
బదియార్వన్నె పసిండితీవల గతిన్ బ్రాకెం బ్రభాజాలముల్

ఇందులోఁ బ్రాకెన్ అను భూతకాలిక క్రియారూపమును బ్రాకన్ అను తుమున్నర్థక రూపముతో నేను ప్రకటించితిని. ఇందు వలన

వాక్యము సంశ్లిష్టమయినదని మూర్తిగారి యాక్షేపము. ఎట్లో నాకు బోధపడలేదు. సూర్యోదయమునకు ముందుగా దిశలకెగఁబ్రాకునవి సంధ్యారుణకాంతులు. అనంతరమే గదా సూర్యబింబము గోచరమగును. కావున మూఁడు నాలుగు పాదములలో రెండు వేర్వేఱు సమాపక క్రియలుండుట కన్నఁ జివరది తుమున్నర్థక రూపములో నుండుటయే యొప్పిదమని నాయూహ.

6. "కీసిన వెదురు సలాకలు" అను పద్యమున నేను "గీసిన" అని సరళాక్షరము నుపయోగించితిని. వ్రాఁత ప్రతులలోని పాఠము నిట్లు మార్చుట సరిగాదని మూర్తిగారి యాక్షేపము. ఏ రూపముతో నున్నను బాఠకుల కర్థము సుగమమే. పూర్వముద్రణ పాఠమునడుగునఁజూపుట నేను మానలేదే! పరుషాక్షరముతో కన్న నీశబ్దమును సరళాక్షరముతో వాడుటయే శ్రావ్యమని నాతలంపు. నేఁటి వ్యవహారములో "గీయు" ధాతువు, దానినిబట్టియే "గీసిన" "గీత" అనురూపములే యెక్కుడువాడుకలో నున్నవి. "కీసిన" అనురూపము నిఘంటువుల కెక్కలేదు.

7. లక్ష్మణవర్యులు పెట్టిన వంట పూటింటియందలి బ్రాహ్మణ విశ్వస్త వర్ణనములో నామె నచ్యుతు జాగరవేళ "కోయిల పంచమ స్వరము గోల్పిన భంగిని విద్ధికంచి రామాయణ మాఱుకాండములు" పాడెనని ప్రభాకరశాస్త్రిగారి ముద్రణమున నున్నది. "విద్దికంచి" అను దానికి విద్దకంచి "విద్దికూచి" అను రూపములు గూడ వారు సూచించిరి. కాని యీ పదముల యర్థవిచారమేమియు వారు గావింపలేదు. రామాయణములు చాలవఱకా కవుల పేర భాస్కరరామాయణము, రంగనాథరామాయణము, మొల్లరామాయణము, గోపీనాథ రామాయణము, ఇత్యాదిగా వెలసియుండుట సర్వ విశ్రుతము. కొన్నియవి వెలసినగ్రామనామములతోఁ గూడ e. g. మోక్షగుండరామాయణము, లేపాక్షిరామాయణము ఇత్యాదిగా వ్యవహృతమగుటయుఁ

గలదు. కాని విద్దికంచి కంచివిద్ది శబ్దము లుపపదములుగాఁగల రామాయణము లేవియు నెచ్చటను బ్రచారమున్నట్లు కానరాదు. ఇవి గ్రామనామములయినచో నవి యెచ్చట నున్నవో శాస్త్రిగారు గాని కవిగారు గాని వివరింపలేదు. పాడుటకనువయిన గేయరూపక రామాయణము రంగనాథుని ద్విపదరామాయణమే క్రీడాభిరామ రచనమునకు మున్నుమున్నా తెండ్లనుండియుఁ బ్రచారమందున్నది. "కోయిల పంచమ స్వరము గ్రోల్చిన భంగిని" అని మునుముందే చెప్పఁబడినది గాన, యందు కనుగుణముగాఁగవి "కంఠ మెత్తి" యని యా వెనువెంటనే వ్రాసి యుండునని యూహించి యట్టి సవరణను నా ముద్రణములో నాపాదించితిని. "ఉచితము గాదు" అని యొక ముక్కతో మూర్తిగారు దీనిని త్రోసి రాజనిరి. కాని "విద్దికంచి" శబ్దమున కర్థమేమో తామయినఁ జెప్పరయిరి. విజ్ఞులెవరైన దానికర్థము చెప్పినఁ గృతజ్ఞతతో గ్రహింతును.

8. దీని పూర్వమందున్న 169 పద్యములో నా బ్రాహ్మణవితంతువు గుహ్యావయవచ్ఛాయ నవలక్షాఖీశ ఫాలస్థలీ సౌవర్ణసీరపట్టబంధసుషమా సౌభాగ్యలక్ష్మిన్ గనున్" అని పూర్వ ముద్రణలలో నున్నది. ఇందుఁ గవియుద్దేశించిన హాస్యరసము "నగున్" (తిరస్కరించును) అను రూపముతో నుత్కృష్టతనొందుననెడి యూహతో నట్టి రూపమును నేను గ్రహించితిని. ఈ మార్పు వలన సారస్యము తమకుఁ గానరాలేదని మూర్తిగారు వ్రాసినారు. ఈవిషయమున సహృదయులే ప్రమాణము.

9. గ్రంథాంతమున మంచనశర్మ యానాఁటి రేయి విహారమున కయి సాయంకాలమున నొక తమ్మడిసాని యింట విడిసెనని తన మిండడగు కామమంజరికిఁ దనరాక "నపుష్పాజారి విధవచే" నెఱిం

గించి యామెనక్కడికి రప్పించుకొనెననియు 274 వచనమునఁ జెప్పఁబడినవి. ఇందు వలన నాతఁడువిడిసిన యింటి యజమానురాలే తమ్మడి సానియని కామమంజరికిఁ గబురు మోసిన "పూజారి విధవ" యామెయేయనియుఁ బాఠకులకు సువ్యక్తమగును. తరువాత నామెకుఁ గొంతపణమిచ్చిమంచనశర్మయే తనవెచ్చెలిటిట్టిభునికి యాావనమందున్న యామె కూఁతురుతోడి కూటమి నేర్పఱచినాఁడు. తమ్మసీ, పూజారి శబ్దములిటఁ దరువాతి గద్య పద్యములలో నభేదకముగ నుపయోగింపఁబడినవి.

గీ॥ సన్నచూపులఁ బూజరి సానిబిలిచి।పసిడిటంకంబు పరిరంభపణముచేసి। టిట్టిభునితోడ నేఁడు కూడింపుకూతు।నేకశయ్యా సహాయ సుశ్రీకి మించ॥ అను 289 పద్యమును, "పూజరి సానిబిడ్డను వెడ్డు వెట్టి టిట్టిభుని చేతికిచ్చి" యని 292 వచనమునను జెప్పిన వాక్యముల వలన టిట్టిభునితోడి కూటమి కేర్పడినది పూజారి విధవ కూఁతురేగానియామె సూత్రము గాదని తోఁపఁ గలదు. కాని పైని జెప్పిన 274 వచనము తరువాత 287 వచనములో "అని జారదంపతులు పూజారి సానియింటి ముంగిట వెన్నెలబైటనుండి టిట్టిభునకుఁ గట్టాడి ముత్తియంబునుంబోని తమ్మడి సాని గూర్చు నేర్పు విచారించి" అని ప్రభాకరశాస్త్రిగారి ముద్రణమందున్నవి. "తమ్మడిసాని" అని గ్రంథమునఁ బేర్కొనుట యిది రెండవసారి. 274 వచనములో "తమ్మడిసాని మందిరంబున విడిసి తనరాక (కామమంజరికి) దేవయాత్రామిషంబున నప్పూజారి విధవచేత నెఱింగింపఁబనిచి" అని యుండుటచేతఁ దరువాత 287 వచనములో ప్రభాకరశాస్త్రిగారు ముద్రించినట్లు కేవలము "తమ్మడిసానిఁ గూర్చు నేర్పు విచారించి" అనియే యున్నచో నిటఁ బేర్కొనఁబడిన తమ్మడి సాని గూడ మున్నుదాహరింపఁబడిన పూజారి విధవయే యని చదు

వరు లభిప్రాయపడుట కెంతేని నవకాశమున్నది అందుచే నీయన ర్థము నివారించుటకే నేను వావిళ్ళవారి ముద్రణములోనిట సాని శబ్దము తరువాత "కూఁతు" శబ్దమును జేర్చినది. ఇందు వలన సందర్భ శుద్ధి యేర్పడునే గాని ప్రత్యవాయ మేమియులేదు "పూజారి సానియే తల్లి, తమ్మడి సానియే పూజరి సానికూఁతురు. విమర్శకులు (అనగా నేను) "కూఁతు" అని చేర్చి చెప్పినప్పుడెట్టి యన్వయము చెప్పుదురో యట్లే ఆపదము లేకున్నను నన్వయము పొసగును. అంతేకాదు పూజరి సానియు, తమ్మడిసానియుఁ దల్లి బిడ్డ లనఁదగినట్లే యున్నది. కావున వారి సంస్కారమనవసరము. ఉన్న పాఠము తిన్నగానే యున్నది." అని శ్రీ యానందమూర్తిగారు విస్తరించి వ్రాసిరి. 274 వచనమందలి "తమ్మడిసాని" "అప్పూజారివిధవ" అను శబ్దముల మరల బాగుగాఁ జదివికొన్నచో 287 వచనములో తమ్మడి సాని శబ్దము వెంట "కూఁతు" శబ్దమును జేర్చి నేను గావించిన సంస్కారము యొక్క యావశ్యకత వారికే గోచరము కాఁగలదని మనవిచేయు చున్నాను. చదువరులకు సందిగ్ధత దోఁపకుండఁ జేయుటయే నాలక్ష్యము.

ప్రభాకర శాస్త్రిగారు సర్వత్ర భ్రమ ప్రమాదరహితులనఁ జాలము. "ప్రమాదో ధీమతామపి" అని యార్యోక్తి. ఎచ్చటనైన భ్రమ ప్రమాదములకులోనైనచో నదివారి పాండిత్యమునకు లోప మాపాదింపఁజాలదు. పీఠికలోనే శ్రీనాథుని శీలవిషయమున నాతఁడు శృంగారియే యను నిరూపించుటకయి కాశీఖండమందలి "ఏమిగుడువంగవచ్చి నాయిండ్లువిడిచి హరుని వెలివెట్టినట్టి యీ యాగ మునకు" అను పద్యము (ఆ7-61) నుదాహరించుచు నదిదక్షాధ్వరధ్వం సమునకయివచ్చిన వీరభద్రుఁడు ఇంద్రాదిదేవతలఁగూర్చి పల్కినట్లుగా వ్రాసియున్నారు. కాని వాస్తవముగా నిదిపల్కినది శివభక్తాగ్రేసరుఁడు విప్రర్షియగు దధీచి గాని వీరభద్రుఁడుగాదని, కాశీఖండమును శాస్త్రిగారు

సావధానముగఁ జూడఁదగునని రీ వ్రాఁతలకు సమాధానముగా నేను రాజమండ్రి ఆంధ్రేతిహాస పరిశోధకమండలివారి రెడ్డిసంచికలో ప్రకటితమయిన "శ్రీనాథమహాకవి" యను వ్యాసములో వ్రాసియున్నాను. దానిని గుర్తించియే కాఁబోలు నేఁటి క్రీడాభిరామ పునర్ముద్రణములో శ్రీ యానందమూర్తిగారు తమతండ్రిగారి సందర్భమునఁ బొలయిన భ్రమను బహిష్కరించి వీరభద్రునిఁ జేర్కొన్న రెండు తావులను గూడ "వీరభద్రుఁడు" అనుటకుబదులు దధీచియని చదువుకొనవలెనని సవరణను బ్రతిపాదించినారు. ఇప్పట్టునఁ గూడఁ దమతండ్రిగారి వ్రాఁత లమోఘములని, కాశీఖండమందలి శ్రీనాథుని వ్రాఁతలే సవరింపఁదగునని పిడివాదమునకు వీరు పూనకుండుట ముదావహమే.

## రచనము

క్రీడాభిరామము కేవలము స్వతంత్రకృతి కాదు. రావిపాటి త్రిపురాంతకుఁడు సంస్కృతభాషలో వ్రాసిన నాటకము ననుసరించి వీథి యనురూపకముగ వ్రాయఁబడినదని యవతారికలో స్పష్టముగానున్నది. త్రిపురాంతకుని మూలగ్రంథ మింతదనుక లోకమునకు లభింపలేదు. ఇఁక నీయనువాద కర్తృత్వ విషయమునఁగూడ బోలెఁడు వివాదగ్రంథము పెరిగియున్నది. దాని నానుపూర్విగ వావిళ్ళవారి ముద్రణము పీఠికలో నుదాహరించియేయుంటిని. ఇందలి ప్రతిపదము శ్రీనాథుని పట్టియిచ్చుచున్నదని కావున గ్రంథమంతయు శ్రీనాథ రచితమేయని ప్రభాకరశాస్త్రిగారి ప్రతిపాదనము. పితృభక్తితత్పరులగు శ్రీ యానందమూర్తిగారుగూడ దానినే శిరసావహించిరి. ఈ గ్రంథము పూర్తిగ వల్లభరాయరచితమేగాని శ్రీనాథ రచితముగాదని వీరేశలింగముపంతులుగారు, ఉకుమళ్ళ అచ్యుతరావుగారు, వేమూరి విశ్వనాథశర్మగారు వాదించినారు. శ్రీనాథుని సిద్ధహస్తమిందసలు చేరకపోలేదని విజయ

నగరప్రయాణములో మార్గమధ్యమున వల్లభరాయని వినుకొండలోనో మోపూరులోనో కలిసికొనినప్పు డాతనివలన నీకృతి రచనోద్యమమును విని తానుగూడ నాతనికందు సహకరించియుండునని లుప్తమయిన శిథిలావతారికాభాగములలో నాతని సాయము పేర్కొనఁబడియుండునని నేను 1922 సంవత్సరమున ఆంధ్రపత్రిక సారస్వతానుబంధములోఁ బ్రకటించిన "క్రీడాభిరామము; శ్రీనాథునికి దానితోఁగల సంబంధము" అనువ్యాసమునాఁటినుండి చెప్పుచునేయున్నాను. తరువాత సారస్వత సర్వస్వములోఁ బ్రకటితమయిన నా శృంగార శ్రీనాథ విమర్శనములోఁగూడ నిట్టి ప్రతిపాదనమే కావించియున్నాను. మొదట 32 పద్యములున్న యవతారికాభాగము, గ్రంథాంతమున వల్లభరాయని యాశీర్వాదపూర్వకముగ రచితమయిన "ముదమునముల్కినాటి పురమోహనశైల—" అను 275 పద్యము, భీమఖండ పద్యానుసరణమయిన "గార్గ్యసిద్ధాంతము పః కాలకలన" (ప.66) శాలివాహన సప్తశతినుండి గైకొనఁబడిన "పటు ఝుంఝూపవనో త్త్రిశాలయములో" (ప॥ 60) "మాఘమాసంబు పులివలె మలయుచుండ" (ప262) అనుపద్యములు కేవలము శ్రీనాథకృతము లేయనుట కభ్యంతరము లేదు. మఱికొన్నిపద్యములలో శ్రీనాథరచితగ్రంథస్థపద్యపాదములు, తత్సామ్యముగలసంవాదములు నందందుఁ గానవగును. మిత్రులు శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు నాయూహలతోఁ జాలవఱ కేకీభవించిరి. తా మిటీవలఁ బ్రకటించిన "శ్రీనాథకవితాసమీక్ష, (ప్రథమభాగము) "శ్రీనాథుఁడు శృంగారియా" యనుగ్రంథములో శ్రీనాథరచితములుగా లోకము భ్రమించు నీగ్రంథపద్యములు పెక్కింటిలో శ్రీనాథుని ప్రౌఢతాసౌభాగ్యములు, శయ్యారామణీయకములు గానరావని యిట్టివి వల్లభరాయరచితములుగనే గణింపఁదగునని సహేతుకముగా నిరూపించిరి.

మచ్చునకు "సంచారించిన నీపయోధరములాస్ఫాలింతునో" (ప॥ 90) మున్నగు పద్యములమీఁది విపర్యసమును బరీక్షించునది. వారి యభిప్రాయములాదరణీయములేయని నా నిశ్చయము.

గ్రంథావతారికయందలి "గణనకెక్కిన దశరూపకములయందు, వివిధ రసభావభావనవీథి లెస్స, ఏ కవీంద్రుఁడు రచియించె నీప్రబంధమనుచు మీరానతిచ్చెదరేని వినుఁడు" అను మొదటి పద్యమును బురస్కరించికొని శ్రీ యానందమూర్తిగారొక వింతపక్ష మాలంబించి "ఇది వీథినాటకము ; ప్రబంధము" అను శీర్షికతోఁ గొంతగ్రంథమును బెంచియున్నారు. వల్లభరాయఁడు రావిపాటి త్రిపురాంతకుని గ్రంథమునను సరించి మోపూరు భైరవస్వామి తిరునాళ్ళలోఁ బ్రదర్శించుటకయి కేవలము పాత్రసంభాషణరూపకముగ వచనములో వ్రాసియుండ దానినిబట్టి పద్యకృతిగా నిప్పటిగ్రంథముఁ జేయు శ్రీనాథుఁడు రచించెనని వారి వ్రాఁతలందలి సారాంశము. తండ్రిగారి నిర్ణయములకు భిన్నముగా నీవిధముననైన నీగ్రంథమునకు వల్లభరాయకర్తృత్వమును గొంతవఱకా మోదించుట సంతోషావహము. ప్రబంధశబ్దమును అష్టాదశ వర్ణనాత్మకమగు నాపేరి కావ్యమునకేగాక కేవలము కూర్పు, రచనము, అను నర్థమునఁ గూడఁ బూర్వకవులు వాడియుండుట సర్వవిదితము. "బసవలింగ" అను మకుటముతోఁ బాలకురికి సోమనాథుఁడు వ్రాసిన చతుర్వేదసారము అను సీసపద్యశతకములో నిట్టియర్థముననే "ఆంధ్రభాషఁ బ్రకటింతుఁ బద్యప్రబంధముగను" అని వ్రాసినాఁడు పురాణాంధ్రీకరణములగు శ్రీనాథుని భీమఖండ, కాశీఖండములలో "నాకుఁగృపసేయు మొకప్రబంధమ్ము నేఁడు" ఇపుడు చెప్పంగఁ బూనిన యీప్రబంధమంకితము సేయు వీరభద్రియ్యపేర" అని యున్నది. ఇట్టిప్రయోగము లెన్నియో యున్నవి. క్రీడాభిరామపద్యమునఁ గూడ "ప్రబంధ" శబ్దమిట్టి యర్థముననే వ్రాయఁబడినది. ఆనందమూర్తిగారు వింతనిర్ణయ

ములఁ జేయుట సరిగాదు. సంస్కృతనాటకములను బట్టి తెలుఁగున శృంగార శాకుంతలము, ప్రబోధచంద్రోదయము మున్నగు పద్యకృతులవలెఁ గ్రీడాభిరామముగూడ వీథిరూపకలక్షణములతోఁ బద్యములలో వ్రాయఁబడిన ప్రబంధకృతియేగాని మఱొకటిగాదు. రావిపాటి త్రిపురాంతకుఁడు సంస్కృతమున రచించిన నాటకముగూడ వీథిరూపకమేయయియుండును. దానికిఁ జాలవఱకుఁ జేరికగనే క్రీడాభిరామము రచితమయియుండునని నాయభిప్రాయము. విజ్ఞులు సమాలోచింతురుగాక!

## అర్జునునిశీలము భారతమున నొకఘట్టము.

### శ్రీకృష్ణభిక్షు.

ఆంధ్రభారతము కర్ణపర్వమునఁ దృతీయాశ్వాసమునఁ గర్ణుఁడు భార్గవాస్త్రము ప్రయోగింపఁగా నర్జునుఁడు పిఱికి యయ్యెనని గలదు.

"గాండివి శౌరి కిట్లు లనుఁ గర్ణునిఁ జూచితె యేకవిక్రమో
ద్దండతఁ దెంపు సేసి పటుదర్పము సూపుచుఁ దేఱిచూడ రా
కుండెడునట్లుగా నలుక నుండెడుఁగావున నిప్పు నేస్సమై
నుండక యీసునం దొడరి యోటమి దెచ్చికొనంగ నేటికిన్. 16
"చచ్చిన మఱి గెల్పు గొనఁగ వచ్చునె? తనయొడలు గలుగ
వైరులగెలువఁగ । వచ్చుం దఱి వచ్చిన నది । మెచ్చు బుధాగ్రణులకు
మెరుదమిత్రధ్వంసీ! 17
"పట్టపగలంటిసూర్యునిపగిదిఁ గర్ణుఁ । డుగ్రమూర్తియై వెలుఁగుచు
నున్నవాఁడు । మనరథం బిప్పుమాధవా మరలనిమ్ము; । బ్రదికియుండిన
శుభములు వడయవచ్చు". 18

ఇందుఁ బ్రాణభీతిచే నర్జునుఁడు కర్ణుమార్కొన వెఱచె ననియు నపుడు తొందరిన జన కోటమి తప్పదనుకొనె ననియుఁ గాన బ్రదికియుండి

కాలాంతరమున గెలుపుగొనఁ దలఁచె ననియుఁ దెల్లము. ఈ ఘట్టముచే నర్జునునికిఁ దెలుఁగువారిలో దీఱనికళంకమునపకీర్తి యలముకొని యున్నవి. నాకో మూలమును బెక్కుసారులు పఠించియున్న కతమునను, అందిట్లు లేమిని, ఇది తెలుఁగు వారిజిత్తే యని తెల్లమయినది. ఇటీవల నూఁజెల్లూరున నొకరీయర్జునునిభీరుత్వమును గ్రంథమున నిరూఢము కూడఁ జేసినా రని వింటిని. కనుక నీవిషయమును ఈ వ్యాసముఖమునఁ వివరింపఁ దలంచినాను.

సంస్కృతమున నేమున్నది? భాండార్కరుఇన్‌స్టిట్యూటువారి ప్రతి, కర్ణపర్వము-383 పేజీ

అథాబ్రవీ ద్వాసుదేవం కుంతీపుత్రో ధనంజయః
భార్గవాస్త్రంమహాఘోరం దృష్ట్వా తత్ర సమీరితమ్ 45
పశ్య కృష్ణ ! మహాబాహో భార్గవాస్త్రస్య విక్రమమ్
నైత దస్త్రం హిసమరే శక్యం హంతుం కథంచన 46
సూతపుత్రం చ సంరబ్ధం పశ్య కృష్ణ మహారణే
అంతకప్రతిమం వీరం కుర్వాణం కర్మ దారుణమ్ 47
సుతీక్ష్ణం చోదయ న్నశ్వాన్ ప్రేక్షతే మాం ముహు ర్ముహుః
న చ పశ్యామి సమరే కర్ణస్య ప్రపలాయితుమ్ 48
జీవన్ ప్రాప్నోతి పురుషః సంఖ్యే జయపరాజయౌ
జితస్య హి హృషీకేశ వధ ఏవ కుతో జయః 49

అక్కడ మహాఘోరమైన భార్గవాస్త్రము ప్రయోగింపఁ బడుటఁ జూచి కుంతీపుత్రుఁడు ధనంజయుఁడు వాసుదేవునితో నిట్లనెను.

"కృష్ణా! మహాబాహో, భార్గవాస్త్ర విక్రమమును జూడుము ఈ యస్త్రము నెట్లును యుద్ధమునఁ గొట్టుటకు శక్యము గాదు. సూతపుత్రుఁడును సంరంభముతో నున్నాఁడు చూడుము కృష్ణా! మహారణ.

మున యమునియట్లు వీరుఁడు దారుణమైన కర్మ చేయుచున్నాఁడు. తీవ్రముగా గుఱ్ఱములను దోలుచు నన్ను మాటిమాటికిఁ జూచుచున్నాఁడు.

యుద్ధమునఁ గర్ణునికిఁ వెఱచి నేను పలాయనము చేయలేను. జీవించినపుడు పురుషుఁడు యుద్ధమున జయపరాజయములను బొందును. ఓడిన వానికి హృషీకేశ! చావే! జయ మెక్కడనుండి కలుగును? 'సుతీక్ష్ణం'కు అభీక్ష్ణం పాఠాంతరము "చోదయ న్నశ్వాన్" కు "చోద యాశ్వాని" అనియు; 'పశ్యామి' యనుటకు "శక్ష్యామి" యని ముఖ్య పాఠాంతరములు.

ఇందెక్కడను అర్జునుఁడు ప్రాణమునకు వెఱచి పలాయనము చేయఁగోరుట గానరాదు. కర్ణుఁడు ఘోరముగా పోరుచున్నాఁ డనుట రెంటను సామాన్యము. నన్ను మాటి మాటికిఁ జూచుచున్నాఁడు అనుటయు, "చోదయ న్నశ్వాన్" కు "చోద యాశ్వాన్" అను పాఠమును జూచిన అర్జునుఁ డాతని నెదుర్కొనఁ బూనెనని తెల్లము కాఁగలదు.

'నేను గర్ణునికి యుద్ధమున వెఱచి పరుగిడలే' నని మూలమున నుండఁగా 'మరలనిమ్ము రథము' ననుట యెట్లు? లేక యుద్ధ మారంభించిన తర్వాతఁ బరుగిడలేను, ఇపుడే మరలనిమ్ము' అనుటయా? జీవించినపుడు పురుషునికి జయాపజయములు కలుగును' అనిన నా కిపుడు 'ఓటమి తప్పదు. ఈ సునం దొడరి యోటమి దెచ్చుకొనంగ నేఁకిన్' అనుట సాధువైన యనువాదమా? జీవన్ బ్రదికి యున్నపుడు జయాపరాజయములు వచ్చు" ననుమూలమునకు "బ్రదికి యుండిన శుభములు పడయవచ్చు ననెడి తెలుఁగును, "తన యొడలు గలుగ వైరుల గెలువన్ వచ్చుం దఱి వచ్చిన" యమూలకము. 'అది మెచ్చు జయార్థులకు' అనుటయును.

'పట్టపగలింటి ... ...' పద్యము మూలమున లేదు, ఈ ప్రతియందు; దేశమున నున్న ప్రతు లన్నింటిలో ఒక్క-పూనా బొంబాయి ఓరియంటల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూటు వారి వ్రాత ప్రతి నెం25లో మాత్రము కలదఁట. దానిని బట్టి పి. పి. యస్. వారి వావిళ్ళ 'నాగర' ప్రతియందుఁ గలదు. వావిళ్ళవారు తెలుఁగక్షరములలోఁ బ్రకటించిన ప్రతి యందును లేదు. తిక్కన గారికి దాక్షిణాత్యపాఠము దొరకియుండును గాఁబోలు. అక్కడి పాఠము.

'ఏష కర్ణో రణే భాతి మధ్యాహ్న ఇవ భాస్కరః
నివర్తయ రథం కృష్ణ జీవన్ భద్రాణి పశ్యతి''

దీనికి మాత్రము తిక్కనగారు సరియైన తెనుఁగు వ్రాసియున్నారు. కనుక తిక్కనగారి దోష మేమి ? అన్న వాదమును వెనుక పరామర్శింతము. ముందు మిగిలిన సంస్కృత శ్లోకముల నర్జున భీరుత్వ ప్రతిపాదకములుగా నన్వయింపరాదా యని కొందఱి సందేహము.

'నేను యుద్ధమున పలాయనము చేయలే నన్న నిపుడే పలాయనము చేయుదునని తెలుఁగుచేత సాధు వగునా ? ఇది తిక్కన్న గారికిఁ దోఁచిన ధ్వని కాఁబోలు ప్రతికియున్న జయపరాజయములు కలుగు నన్న అర్థము నా కిపుడు పరాజయము తప్ప దనియా ? ఓడిన వానికి చావే మఱి జయ మెక్కడ' యన్నదానికి నాకు గెలుపే ముఖ్యము. ఇపుడు తొలఁగి తర్వాత,తఱి వచ్చిన గెలుపుగొందును. నేను జయార్థి ని గనుక''యని తిక్కనగారి వ్యాఖ్యానము. ఈ వ్యాఖ్యానము అర్జునుని శీలమునకు విరుద్ధము. ప్రకరణోచితము గాదు. కావ్యమార్గము నను బ్రశంస్యము గాదు.

సాటికి నిట్టిదియే యగు నింకొకఘట్టమును జూతము. ద్రోణ పర్వమున రాత్రియుద్ధము నాఁడు కర్ణుఁడు చాల విజృంభించును. అపుడు.

"ఏవ ముక్తో మహారాజ పార్థః కృష్ణ మథాబ్రవీత్
భీతః కుంతీసుతో రాజా రాధేయ స్యాద్య విక్రమాత్ అ 173.29
ఏవంగతే పార్థివ్రకాలం కర్ణోనీకే పునః పునః
భవాన్ వ్యవస్యతు క్షిప్రం ద్రవతే హి వరూథినీ 30
ద్రోణనాయకనున్నానాం భగ్నానాం మధుసూదన
కర్ణేన త్రాస్యమానానాం అవస్థానం న విద్యతే
పశ్యామి చ తథా కర్ణం విచర న్తమభీతవత్ 31
ద్రవమాణాన్ రథోదారాన్ కిరంతం నిశితైః శరైః 32
నైనం శక్ష్యామి సంసోఢుం చరంతం రణమూర్ధని
ప్రత్యక్షం వృష్ణిశార్దూల! పాదస్పర్శ మివోరగః 33
స భవాన్ తత్ర యాత్వాశు యత్ర కర్ణో మహారథః
అహ మేనం హనిష్యామి మాం వైష మధు సూదన 35

"నైనం శక్ష్యామి సంసోఢుం" నే నోర్వలేనన్న నే నోడిపోవుదు ననియు నర్థము చెప్పనగునా ? ప్రకరణము చూడవలదా ? నే నితని జంపుదును కాదా నన్నితఁడైనఁ జంపుగాక ఈ మాటలం దర్జునుఁడు చావనైనఁ దెగించియుండుట స్పష్ట మగుట లేదా ? అర్జునుఁ డిట్లు తెగించువాఁడెకాని పరుగెత్తునను వాఁడు కాదుగదా అప్పుడును గర్ణుని.

"పశ్యామి కర్ణం కౌంతేయ దేవరాజ మివాహవే
విచరంతం నరవ్యాఘ్ర మతిమానుష విక్రమమ్ 36

అని కృష్ణుఁడును మెచ్చుకొనుచు. అట్లే యిక్కడను కర్ణుఁడు విజృంభించిన కర్ణపర్వమునను అర్జునుఁడన్న పలుకులకు వేఱర్థము చెప్పనగునా? ద్రోణపర్వమున రాత్రి యుద్ధము నాఁటికి కర్ణుని కింద్రుఁ డిచ్చిన శక్తియు నున్నది.అయినను అర్జునుఁ డాతని నెదుర్కొన సంశ

యుంపలేదు గాని అతని నియామకుడు కృష్ణుడే సర్వకాల సర్వావస్థలయందు 'భవాన్ వ్యవస్యతు' కర్ణపర్వమునను అర్జునునియుద్దేశ్యమదియే నేను పరువెత్తను, చచ్చిననుజావే జయాపజయము లధ్రువములు. ఏమందువు ? అనుటయే అర్జునుని తాత్పర్యము గాని పరువెత్తుదము మన రథంబును మరలని మ్మనుట గాదు.

II ప్రకరణమునుబట్టి చూచినను తిక్కనగారి పాఠముగాని వ్యాఖ్యానముగాని సముచిత మని తోఁచదు.

1. అర్జునుఁ డశ్వత్థామ నోడించెను. జయావేశమున పాండవ సైన్యములు దుర్యోధను సేనలపైఁ బడినవి. కర్ణుఁ డెదుర్కొని భార్గవాస్త్రమును బ్రయోగించెను. దానిని జూచి యర్జునుఁడు తిక్కనగారి యనువాదమున మనరథంబును మరల నిమ్ము ఇత్యాది అనెనఁట. తర్వాత

"అనిన విని వాసుదేవుండు వడముడిదిక్కు విలోకించు నెడ నీతండు కర్ణునకు మార్కొని పరాక్రమించి పాండవసైన్యంబు నిలువరించి" భార్గవాస్త్రమునుజూచిన భీముఁడు వెఱవలేదు; మార్కొన్నాఁడు? కాని అర్జునునికిఁ బ్రాణభీతి గదిరినదా? రథమును మరల్పమనునా? భీముఁడు పాండవసైన్యము నిలువరింపఁగా నర్జునుఁడు పరుగిడఁగోరునా ? ఈ వ్రాఁత ప్రశస్తమా ? భీమునికన్న నర్జునుఁడు తక్కువవాఁడా ?

2. ఈమాట లను నప్పటికిఁ గర్ణుఁడు తనవైపునకు రాలేదు. దూరాననున్నాఁడు. అతఁడు చూచినమాత్రముననే అర్జునుఁడు బెదరి బ్రదికియుండిన శుభములు పడయ వచ్చు ననునా.

3. ధృష్టద్యుమ్న, శిఖండి, సాత్యకి, ద్రౌపదేయాదిరథికులారథికుం దలపడ! అరథికుఁ డన కర్ణుఁడే. వీ రెవ్వరు కర్ణుని కోహ

టింపలేదా? ఎదురుకొన్నారా? అర్జునుఁ డట్లు సేయఁజాలక ప్రాణ ముండినఁ జాలు ననుకొన్నాఁడా? బిడ్డలు ద్రౌపదేయాదు లతని మార్కొనుచుండఁగాఁ దాను వారిని విడిచి వెనుక కరుగఁ దలంచునా, మానవస్వభావమా ?

4. “అమ్మురారి తే రక్కురుసేనాధిపతి సంగ్రామము చేయు చక్కటి కెడ గలుగం గొని చని” ఇవి దాక్షిణాత్యపాఠమునకుఁ దెనుఁగుసేఁత. ఇతరప్రతులందు లేదు.

“తతో జనార్దన స్స్మృత్వా తస్య వాక్యం విశాంపతే
రథే నాపయయౌ క్షిప్రం సంగ్రామా దితి భారత అ 73-1
ప్రత్యనీక మవస్థాప్య భీమం భీమపరాక్రమమ్
అలం విమహితుం హ్యేష కురూణాం సంప్రపద్యతామ్ -2
కర్ణం చ సమరే రాజన్ గ్రాహయిష్యన్ శ్రమంప్రతి
విశ్రమార్థం చ కౌరవ్య పాండవస్య మహాత్మనః” -3

ఈ శ్లోకములు కేవలము దాక్షిణాత్యపాఠముననే గలవు తర్వాతికథ వీని కనుగుణ మేమో చూతుము.

తర్వాత కృష్ణుఁడు ధర్మరాజు చక్కఁగా దెబ్బలు తిన్నాఁ డని చెప్పును. అర్జునుఁ డన్నను జూడనేఁగును. ఎక్కడకు ?

దాక్షిణాత్యపాఠమునే యనుసరింతము.

“సంయుధ్యమానాన్ పృతనాముఖస్థాన్
తాన్ వై శూరాన్ హర్షయన్ సవ్యసాచీ
పూర్వాపదానైః ప్రథితైః ప్రశంసన్
స్థిరాం శ్చకా రాత్మరథా ననీకే

పాణిమునకు వెలిచి తోలఁగఁ బోయినవాఁ డిట్లు శూరులు సేనమొగమున యుద్ధము సేయుచున్నచోటికి వచ్చి, ఆశూరులను

స తోష పెట్టుచు వారు చేసిన పూర్వకీర్తికరవృత్తములఁ జెప్పి పొగడి స్థిరులుగఁ జేసెనఁట. ఎంత చక్కని వ్రాఁత.

ఈ శ్లోకమును దిక్కన వదలినాఁడు మేలే.

అపశ్యమానస్తు తతః కిరీటీ
యుద్ధేస్థితం భ్రాతర మాజమీఢమ్
ఉవాచ భీమం తరసా ఽ భ్యుపేత్య
రాజ్ఞః ప్రవృత్తి స్త్విహ కుత్ర చేతి

"అన్న నొచ్చె నన్న యనుమాన్మట చిత్తంబు
కలఁప నిజబలంబు గలయ జూచి
యన్న రెండుఁ గాన కనిలనందనుకడ
కేఁగి యడిగె నతఁడు నిట్టు లనియె" 3-20

అనిలనందనుఁ డెట నున్నాఁడో! తిక్కన సంస్కృతమును జూచియుం డును ఆయనయు "యుద్ధే స్థితం" యుద్ధమున నున్నాఁడు. అక్కడికే వచ్చెను బ్రతుకఁగోరి అనికి తొలఁగిపోయిన యర్జునుఁడు ? అక్కడ ఎదిరిసైన్యమున కర్ణు డుండలేదు కాఁబోలు.

5. "అనిలనందను నాలోకించి యన్నరుం డానృపాలు తెఱం గెఱుంగుటకు నీ వరుగుము. నేను సేనమొగంబున నిలిచెద"

"స్థాస్యా మ్యహం శత్రుగణాన్ నిరుధ్య"

శత్రుగణముల నిరోధించి నేను నిలిచెదను. నిరోధింపవలసిన యాశత్రువులలోఁ గర్ణుఁడు లేఁడా? కర్ణుని కోఁడిపఱచువాఁ డిట్లనునా?

5. భీముని ప్రత్యుత్తరమును జూడుఁడు.

"అవ్విధంపునడవడి నీకుఁ జనుం గాని జనంబులు నన్నయినం బోరి కోహటించి పోవె నని యాడుదు రని చెప్పిన" అనఁగా భీము నికి తమ్ముఁడు ప్రాణభీతిచే నీనెపమునఁ బరుగిడుచున్నాఁ డని తెలి

యడుగాఁబోలు. జనులు తన్నైన పిఱికి యందురుగాని అర్జును నన రని యతని దృఢవిశ్వాసము. కలికాలమున నట్లనువారు పుట్టఁబోవుదు రన్నంత భావిజ్ఞానము వానికి లేదు.

ఇట్లు తర్వాతనడవడి అర్జునుఁడు కర్ణు నెదుర్కొన భయపడి రథము మరల్చు మనునంత నెఱచినాఁ డని నిరూపింపఁడుగదా! వాని నెదురుకొని సంసిద్ధుఁ డనియే నిరూపించును. అతనిమాట లెల్ల "కడపటియుద్ధము చేయుదునా మానుదునా కృష్ణా నిర్ణయింపు" మనుటకే పరివృత్తములుగాని ఇతరములుగావు.

ఇఁక నిట్లు అర్జునుఁ డేల భయపడవలెను ? ఆనుషంగికముగా నిదివఱ కెన్నఁడైన వెఱచెనా యని పరిశీలింతము.

కర్ణుని జూచి భయపడవలసిన కారణమేమి ? అతనికడనున్న యస్త్రసంపత్తియా ? కర్ణునికడ నుండిన యమోఘాస్త్రములు (1) భార్గవాస్త్రము (2) నాగాస్త్రము (3) శక్తి; భార్గవాస్త్రముచే పేరు మోసిన యోధుఁ డెవఁడును జచ్చినట్లు భారతమునఁ గానరాదు. ఇది ధర్మరాజదర్శనానంతర మర్జునుఁడు పోరికి వచ్చినప్పుడు మఱలఁ బ్రయుక్తమైనటు లున్నది దీనికే అర్జునుఁడు భయపడి యనికిఁ దొలఁగఁదలఁచె ననుట హాస్యాస్పదము. ఇంద్రదత్తశక్తి యానాఁటికి ఘటోత్కచునివధ కయిపోయినది. దాని భయమును లేదు. ఇఁక నాగాస్త్ర మున్నది గాని దాని కలరూ పర్జునుఁ డెఱుంగఁడు. నాగాస్త్రము కృష్ణుఁడు రథమును నొక్కుటచేత వ్యర్థమైనపుడు అర్జునుఁడు కృష్ణ "ఇది యేమి ? మఱల నిది నాపై కురవడించుచున్న దేమి" యని యడుగఁగా కృష్ణుఁ డది యశ్వసేనుఁ డను నాగకుమారుఁ డని పగఁ బట్టి కర్ణునస్త్రమంత్రశక్తిచేత జివరకుఁ జచ్చె నని యిపుడు తానే మీఁదికి వచ్చుచున్నాఁ డనియుఁ జెప్పెను. కనుక నాగాస్త్రము కలరూ

నతఁ డెఱుంగఁడు. సామాన్యనాగాస్త్రము నతఁడు నెఱుఁగును. సంశప్తకులపైఁ బ్రయోగించియున్నాఁడు. సుశర్మ దానిని గారుడాస్త్రమున వ్యర్థము చేసియున్నాఁడు. సుశర్మపాటి యస్త్రజ్ఞాన మర్జునునకు లేదా ? కనుక తా నెఱుఁగని యశ్వసేనసహితనాగాస్త్రమున కర్ణునఁడు వెఱచె ననుట భావ్యమా ?

అర్జునునికడ మోహనాస్త్ర మున్నది. కర్ణుఁడు దానికిఁ బ్రతి నెఱుంగఁడు. ఉత్తరగోగ్రహణమున నర్జునుఁడు దీని నప్రతిహతముగఁ బ్రయోగించియున్నాఁడు. అర్జునని పాశుపతాస్త్రముమాట యేమి ? కాన అర్జునుఁడు కర్ణునిశస్త్రాస్త్రసంపత్తికి వెఱచె ననుట యుక్తిసహము గాదు. గ్రంథమున నుక్తము గాదు

అర్జునుఁ డెన్నిసారులు కర్ణు నెదుర్కొనలేదు ? గెలువలేదు ? ఒక్కమా టైన నతనికోడినాఁడా ?

1. కుమారాస్త్రప్రదర్శనమున వీ రిరువురికిఁ బోరాటము జరుగలేదు.

2. గురుదక్షిణకై ద్రుపదుపై కేగినపుడు దుర్యోధనాదులు ముం దేగి యోడినారు. ఆ యోడినవారిలోఁ గర్ణుఁ డున్నాఁడు. అర్జునుఁడు ద్రుపదుని గెలిచినాఁడు.

3. ద్రౌపదీ స్వయంవరఘట్టమున కర్ణుఁడే యర్జును గెలువ నేరక మగిడిపోయెను.

4. రాజసూయకాలమున కర్ణుఁడు భీము నెదుర్కొని యోడెను.

5. ఘోషయాత్రాసందర్భమునఁ గర్ణుఁడు గంధర్వుల నెదుర్కొనఁ జాలక పరుగిడెను. అర్జునుఁడు వారిని జయించెను.

6. ఉత్తరగోగ్రహణకాలమున నిరుమాఱులు కర్ణు నర్జునుఁడు పాఱఁదోలెను.

7. భారతయుద్ధకాలమునఁ గర్ణుఁడు ఎన్నఁడును అర్జును యుద్ధవిముఖునిగాఁ జేయలేదు. ద్రోణపర్వకాలమున సైంధవవధనాఁడు. కర్ణుఁ డర్జునునిచేఁ బరాజితుఁడే.

8. కర్ణు మొదటియుద్ధకాలమునఁ గర్ణు నోడించినవాఁడే అర్జునుఁడు.

ఈ ఘట్టములు తెలుఁగుభారతమునను గలవు. సందియ మున్నవారలు చూడవచ్చును. ఇన్నిమాఱులు కర్ణు నోడించిన యర్జునుఁడు ఒక్కమాఱు బ్రదుకుతీపిచే నతని నెదుర్కొన వెఱచె నని వ్యాఖ్యానము సేయుట యనుచిత మని మనవి. అవి పేదపల్కులు గావు. ఘటోత్కచయుద్ధసందర్భమునందువలెనే తెంపుపల్కులు. అపుడు కృష్ణుఁడు వల దన్నాఁడు గనుక నిపు డీతనియనుజ్ఞ నడుగుటకే అట్లన్నాఁడుగాని వెఱచిగాదు. సోమయాజులవారు 'నివర్తయ రథం కృష్ణ' యన్న పాడుపాఠమును జూచి పరగ్రంథము నాలోచింపక యీమాను వుగాఁ జెప్పినారన్న ప్రథయు గలదుగావున నట్లు రచించిరి. పూర్వము నట్ల వ్యాఖ్యానించిరి.

అది కావ్యమార్గమునను రమణీయము గాదు. కర్ణు నధికునిఁ జేసి యట్టివానిని అర్జునుఁడు గెల్చె ననిన నుచితమే. నాయకు నట్లభివర్ణించుట అతని కత్యుత్కర్షాదాయకమే. వాల్మీకి రావణుని అతివేలముగఁ బ్రశంసింపలేదా. అంత వానిని రాముఁడు గెల్చె ననిన రాముని కత్యుత్కర్షను గల్పింపలేదా ? కాని ప్రతినాయకు నెదుటఁ బడుటకే నాయకుఁడు వెఱచె ననుట పేలవము. తిక్కన 'రసాభ్యుచితబంధముగఁ' గావ్యము నిర్వర్తించువాఁ డయ్యును బాఠప్రమాదమునఁ జొరపడె నని తలంపవలసివచ్చుచున్నది.

దేశమున నున్న యన్ని దాక్షిణాత్యప్రతు లందును ఈపాఠము గానరాదు. భాండార్కరుఇన్‌స్టిట్యూటువారి కర్ణపర్వపీఠికఁ జూడుఁడు.

మళయాళప్రతులందుఁగాని గ్రంథాక్షరలిఖితప్రతులందుఁగాని తెలుగక్షరముల ప్రతులందుఁగాని వారికీపాఠము గానరాలేదు. కుంభఘోణప్రతిని జూచి కాఁబోలు వావిళ్లవారి నాగరాక్షరప్రతిని బరిష్కరించిన పి. పి. యస్. శాస్త్రిగారీశ్లోకమును అందుఁ గూర్చినారు కుంభఘోణప్రతిని అవలంబించిన వచ్చు ననర్థము వింతయంతఁ గాదు. అది వేఱు సమయమున.

ఇది యట్లుండ నాధునికు లొకరు అర్జునుఁడు ధర్మరాజదర్శనానంతరము అనికి వచ్చుచుఁ గర్ణునిఁ జూడఁగా నతనికిఁ గాళ్ళు వణఁకె ననియు నతనికిఁ జెమటలు గ్రమ్మె ననియు వ్రాసిరని వింటిని. ఇదియు సరి గాదు. అతనికి స్వేదము గ్రమ్మినది కర్ణవధోపాయమును జింతించుచుండఁగా; అంతియకాని కర్ణునిఁ జూచినపుడు గాదు. కాళ్ళు వణఁకను లేదు. నిజ మరయఁదలంచువారు తెలుఁగుభారతమునైనఁ జూడుఁడు.

ఆయాధునికు లంతతో నూరకుండక గీతోపదేశ కాలమునను అర్జునునికిఁ బ్రాణభీతి కలుగఁగా దానిని గ్రప్పి కృష్ణునికిఁ దనకు బంధువర్గమును జంప నిష్టము లే దనియు నింకనేమేమో అబద్ధపుమెట్టవేదాంతములు పల్కె ననియు వ్రాసినారఁట. మనదురదృష్టము, సత్యవాదమునకు మనమింతదూరమున నుండుట. వ్యాసు లేమో 'తం తథా కృపయావిష్టం అశ్రుపూర్ణాకులేక్షణం' అని రచించిరి. కాని ఈ పండితులు కృప యనిన ప్రాణభీతి యని వ్యాఖ్యానించిన మన మేమి చేయవచ్చును? నమస్కరించి యూరకుండవలసినదేగదా. ఇంతకు మనకర్ణాభిమానము మనచేత నేమి చేయింపదు ? నన్నయగారును గర్ణునిఁగొండమీఁది కెత్తినవారే. ద్రౌపదివస్త్రములనొలువవలసినదిగాఁ గర్ణుఁడు దుశ్శాసనునికిఁ జెప్పె నని మూలము. అతని

కాయపకీర్తిని రానీయక కాచుటకుఁ గాఁబోలు నన్నయగా రాసూక్తిని రాజరాజున కంటఁగట్టిరి.

శీలచిత్రమును దాఱుమాఱు చేయు నీయనువాద వైఖరిని బాత్రములకుఁ 'దెనుఁగుఁదనము చొరయించుట' యని రమణీయ మని యొకవాదము. 'మాయిష్టము వచ్చినకథ వ్రాయుచున్నా' మని యేమి వ్రాసినను బాగే కాని యనువాద మన నేల? వర్ణనాదుల స్వాతంత్ర్య మవలంబించినను శీలచిత్రణమునఁగూడనా యీస్వాతంత్ర్యము ? అందు నుత్తమశీలుర నధఃకరించి హీనుల నుత్తములఁ జేయుటయు సత్యశీలికి నుచితమా! ఆ చర్చ వేఱొకపుడు.

---

## 'నైషధములో' నలదౌత్యము

(శ్రీపరాశరం గోపాలకృష్ణమూర్తి ఎం. ఏ.) సిద్దిపేట

కవిత్రయము తరువాత నాంధ్రుల మన్ననలందుకొనిన మహామహోపాధ్యాయుఁడు శ్రీనాథుఁడు. అతఁడు గౌడడిండిమభట్టు కంచుఢక్క 'శతధా' పగులఁగొట్టించిన యుద్దండ పండితుఁడు. తెలుఁగు పద్యములను సంస్కృత శ్లోకములవలె, సంస్కృత శ్లోకములను దెలుఁగు పద్యములవలె మలచిన యపూర్వ ప్రతిభాశాలి. ఇతిహాస పురాణములనుండి కావ్యములవైపు వాఙ్మయమును మరల్చిన యుగకర్త. నిన్న మొన్నటివఱకు నాంధ్రకవిలోకముపై నధికారముద్ర నెఱపిన విద్యాధికారి.

సంస్కృత వాఙ్మయమునం దయఃపిండములవంటి కాదంబరి, నైషధము, సూర్యశతకము మున్నగు ప్రౌఢకృతులు జగజెట్టి పండితుని ముందు వెన్నముద్దలయినవి. శ్రుతి పురాణాగమ స్మృతి సాంఖ్య సిద్ధాంతములను గబళించుటతోపాటు వీనిని గూడ నంజుకొనినాఁడు.

నైషధం విద్వదౌషధమ్మను ఖ్యాతి నార్జించుకొనినది సంస్కృతమున హర్షనైషధము. శ్రీహర్షుఁడు శ్రీనాథభట్ట సుకవికి గురుస్థానము. నారికేళపాకమున నున్న యీగ్రంథమును 'పునఃపునః' ఆస్వాదించుటలోఁ దృప్తిఁ జెందక లోఁడి తెలుఁగువారి కందఱి కందుఁబాటులో నుండునట్లు చేయఁదలఁచినాఁడు. శ్రీనాథుని కృతిమాలలో నాయకరత్నమీ శృంగారనైషధమే. అతని జీవితములో నొక యుజ్జ్వలఘట్టము శృంగార నైషధమును వెల్వఱుచుట కావుననే దీనినతఁడు 'బహుధా' స్మరించుకొనియున్నాఁడు.

ఇందు నాయికా నాయకులు దమయంతీ నలులు. వారు హేమమరాళము వలనఁ బరస్పర సౌందర్య రేఖావిలాసాదుల నెఱింగి యన్యోన్యము వినుకలి వలవంత నొంతయుం జొక్కుచు సుదినంబునకై వేచియుండుదురు. దమయంతీ స్వయంవరము నేఁడెల్లి జరుగఁబోవుచున్నది. వీరసేన తనయుఁడును సమాయత్త కౌతుకభరంబున వెడలినాఁడు. దైవగతి విచిత్రము ! దేవతలకే రిమ్మదెగులు పుట్టినది. పంకజాసను తనుసంభవుని వలనఁ ద్రిభువన మోహనంబులయిన దమయంతీ రూపలావణ్య విలాస విభ్రమంది గుణంబులు విని పంచేషులుంఠిత ధైర్యవిత్తంబులగు చిత్తంబులతోఁ బాకశాసన, పావక, పరేత రాజ, పాశపాణులు స్వయంవర మహోత్సవంబునకుఁ దరలివచ్చువారెదుర నలునింగని యతని నెట్లో యొప్పించి జంగమలేఖంబు గావించి దమయంతికడకు దూతగాఁ బంపిరి. ఇది నలుని శీలమున కగ్నిపరీక్ష.

తానెవతెను ప్రాణపదముగఁ బ్రేమించెనో, యెవతెను వివాహమగుటకుఁ బెల్లుబుకు కోరిక లీరికలెత్త నరుగుచుండెనో, యట్టి భువనమోహినిని, జగదేకసుందరిని, వీఁడు మిక్కిలి తనయందనురక్తు

రాలిని, తననే పరిణయమాడుదునని కృత ప్రతిజ్ఞురాలిని దానుగా నొరులను వివాహమాడుమని చెప్పుటకుఁ గాదు ఒప్పించుటకు దౌత్యము నిర్వహించుచున్నాఁడు. అది యొక విచిత్ర విరోధాభాసము.

యాచింపఁబడుటయేగాని యాచించుట యలవాటులేని సుర లర్థించినారు. ఆ మనస్వి యొప్పుకొనినాఁడు. లోకమున నుదాత్తులు, ఉద్రేకులు, అలసులు నని మానవప్రకృతులు స్థూలముగా మూఁడు తెఱఁగులు. అందు నలుని పాత్రయుదాత్త ప్రకృతికిఁ జెందినది. ప్రాణ గొడ్డమగు సమయమునందును జలింపక, యుక్తాయుక్త విచారణను గోల్పోక కార్యశీలురై జీవననౌక నడపు కర్ణధారులుదాత్తులు. ఈ పరిస్థితియందు రిక్తపాత్రయయిన దేవకార్యమునకుఁ బూనుకొనక పై పెచ్చు వారితో యుద్ధమునకుఁ దలపడి సర్వనాశనమగుటయో యింకే దేని ప్రతీకారచర్యలను దిగుటయో చేసియుండెడిది. నలుఁడీ విషయమున బ్రశస్యుఁడు. దైవగతి దాఁటవచ్చునే యెవ్వరికిని? కానున్నది కాక మానదు.

నానాద్వీపావనీనాథులకు రాయబారులను బంపు నలచక్ర వర్తి తానే రాయబారియయినాఁడు. తిరస్కరిణీ విద్యసాయమున నంతిపురముఁ జొచ్చినాఁడు దమయంతిని జేరి తిరస్కరిణిఁ దిరోహిత మొనర్చి యాపె కట్టెదుర జవనిక వాయందట్టించి బొడసూపు జహు రూపు తెఱంగునఁ బొడసూపినాఁడు. కనులు మూసినను దెఱచినను నహర్నిశము గనిపించు తన వలపుల పెన్నిధి యెదురఁ గన్పించు చున్నది. కాని 'నిర్వికారుండై' యున్నాఁడు. ఉదాత్త ప్రకృతిలోని విశిష్టత యదియే.

అతని నిర్వికారత చూచు వారికిఁ గూడ నవగతమగునంత ప్రస్ఫుటముగ నున్నది. కావుననే దమయంతి "విధరిమ భూరిలతా

భంగ లీలావిజిత సుమనస్సాయక విలాస రేఖాసారంబై నిర్వికారంబైన యాకారం బెవ్వరియందునుం గలదె ?" యని యక్కజం పడినది. పాత్రపోషణము ప్రత్యక్షపద్ధతి, పరోక్షపద్ధతి. యని రెండు విధములు. కవితానై చెప్పుట ప్రత్యక్ష పద్ధతి అది యంత పాఠకుల హృదయములకు హత్తుకొనదు. పరోక్షపద్ధతి దృశ్యకావ్యములం దెక్కువ యాదరింపఁబడును. అది రెండు విధములు. పాత్రయొక్క వేషభాషాదుల వలనఁ దచ్ఛీల స్వభావాదులను వ్యక్తమొనర్చుట యొకరకము. ఇతర పాత్రముల వలనను, సంఘటనాదుల వలనను నొక పాత్రయొక్క శీలస్వభావాదులు వెల్లడియగునట్లు మలచుట, 'రూపు' రేఖలు' దిద్దుట, మఱియొకవిధము కవియొక్క 'కలంకారీ' పనితన మంతయు దీనిమీఁదనే యాధారపడియుండును.

తొలుత 'నిర్వికారుఁడనునై' నేత్రవిషయీభావంబు భజించెనను విషయమా సన్నివేశమునఁ బాఠకుఁడు గమనింపక పోవచ్చును. అతని చూపంతయు నిటమీఁద నేమిజరుగునోయని గుబగుబలాడుచు ముందునకేయుండును. కావున నింకొక్కమాట "నిర్వికారంబైన యాకారంబెవ్వరియందునుం గలదె ? "యని దమయంతీ ముఖమునఁ గవి హెచ్చరించుచున్నాఁడు.

వారిచ్చు నాతిథేయమయిన యర్ఘ్యపూజను గైకొని యాపుణ్యశ్లోకుఁడు ప్రావృషేణ్య పయోధరధ్వాన గంభీరంబయిన యెలుంగుతోడ, నేను దిక్పతుల యాస్థానంబు నుండి వచ్చితిని.

ప్రాణంబులును బోలె నంతరంగమునందుఁ
దత్కార్య భరమును దాల్చినాఁడఁ
జరితార్థముగఁ జేయఁ జనునాదు దౌత్యంబు
నాతిథ్య సత్కారమదియ నాకు" నని

దేవరహస్యమును వెల్లడించినాఁడు. దేవతా కార్యము నెంత ప్రాణపదముగ నతఁ డెంచినదియుఁ బ్రాణంబులును బోలెఁ దాల్చినాఁడ ననుటవలనఁ దెలియును.

వారు చెప్పుమనిన నాలుగు ముక్కలు చెప్పుటలోఁ గాని, 'కట్టె, కొట్టె, తెచ్చె' నని 'ముక్తసరిగా' వ్యవహారమును ముగించుటలోఁ గాని దూతయొక్క చిత్తశుద్ధి నెంచలేము 'ఫలానా' యింద్రుఁ డనుటలోఁ గూడ నంత యుదాత్తత కన్పించియుండెడిదికాదు. కావున నే 'యప్సరసపురుషు' లని మొదలిడి వారి విప్రలంభ వృత్తాంతము నంతయుఁ గనులఁ గట్టి నట్లు హృద్యమగు ధోరణిలోఁ దెల్లము చేసినాఁడు. నని నింత స్థితికిఁ దెచ్చిన వారిని 'బరమపురుషు' లనఁగలుగుట యతని శీలమున కెంతయు వన్నె దెచ్చుచున్నది.

పాకశాసన, పావక, పరేతరాజ, పాశపాణుల విప్రలంభ వేదనాభరమును విడివిడిగా నభివర్ణించి తన నిర్లిప్తతను బ్రస్ఫుటముఁ జేయుటతోఁ నాఁగక "నీయాలింగన ప్రక్రియా.

కేలిస్వప్నములు నీముఖాస్వాదనసక్తిన్నాలుకల్ నాకు నో
బాలా! స్వప్న సమాగమంబుల నిశాపర్యంత యామంబులన్"

ఇత్యాదిగాఁ జెప్పుటయు మానలేదు. 'కడకుఁ జరితార్థునిఁ జేయు కార్యసాఫల్యమునన్' అని దేవతల 'తరఫున' వేఁడికొనినాఁడు.

ఇంత సేపు మాటాడినను దన పేరు చెప్పలేదు. పేరు చెప్పుట యనునొక యంశముపై నే యీ చాతుర్యమంతయు నాధారపడియున్నది. 'ఎయ్యది సంజ్ఞ నీకు' నని యెప్పుడో యడిగియున్నను నీ దేవదూత యీ విషయమును వెలికిరానీక మాటువఱచి గడపినాఁడు. కాని నానావిధ చిత్రవాక్య రచనాచణయగు దమయంతి యంతటితో నూరకొనక 'ప్రశ్న యొక్కటి యొక్కటి ప్రతివచనము, యుక్తి యనుకూల

మైయుండ దుభయము నకు' నని మరల నిలఁదీసి యడిగినది. ఆమాత్ర ము క్తి ప్రత్యుక్తి నైపుణ్యము లేకపోలేదా చక్రవర్తికి! ఎవ్వరికి దోసము లాఁదన పేరు సెప్పుట సమక్ష వ్యవహారమునకుఁ బేరుసెప్ప నడుఁగఁగ నేలా ? ' యని మెల్లో సమర్థించుకొని గ్రుక్క త్రిప్పుకొని.

"వెలఁది నావిూఁదఁగడుఁ గృపావిలసనంబు
నాటి చూచిన చూపు మన్ననయ చాలు
నాకుఁగా నుద్ధరింపుము నాకవిభుల
హస్తములు మోడ్చి వేఁడెద నాదరమున ..' నని

యాలోకోత్తర చరితుఁడర్థించినాఁడు. 'పేరు సెప్పుట నీక నాచారమేని మాకు నాయంబె మీతోడ' మాటలాడ' నను విదర్భ రాజపుత్రి ప్రతిబంధి వచన రచనా చాతుర్యంబునకు వేఱొండు ప్రత్యుత్తరంబతఁడు పొడఁగాన లేకపోయినాఁడు. నా వచ్చిన కార్యమిూనేర్పు మని, కాలయాపన సేయఁగాదని తొందరపడినాఁడు. "అమరాంగనాసంగమాభిశోభితుఁడైన హరికేల మానుషీ పరిచయంబు..." అని దేవకార్యమును బ్రత్యాఖ్యానముచేసి "యే నైషధేంద్రు నవశ్యంబు వరింతు" నని తన ప్రతిజ్ఞను వెల్లడించినది విదర్భరాజకుమారి.

నలుఁడంతటితో నిరుత్సాహపడలేదు. 'సిరిరా మోకాలొడ్డువారు గలరా ? ఘట్టకుటికా ప్రభాతంబు క్రమమునంది యొల్లనని యును దుదిఁబొందకుండరా'దని నచ్చఁజెప్పి వారియందొకరిని వరింపు మని ప్రరోచనము గల్గింప యత్నించినాఁడు. ఆ యుక్తియు విఫల మయినది. పాకశాసన ముఖ్య దిక్పాలవర్గ పాణిపీడన కార్యసంప్రార్థనంబు చూనుమని హస్తములు మోడ్చి వేఁడినదా యిందువదన. "ఇదె మెల్లి కళ్యాణ మేతెంచుచున్నది. ఈ యువాచిక వార్తలిపుడు మాను"మనినది.

చిత్ర వాక్చిత్ర శిఖండినందనుఁడు నలుఁ డంతమాత్రమున నిస్పృహుఁ డెందక 'హరి కల్పవృక్షంబుఁ బ్రార్థించి నినుఁగోరి దివికి రావించిన దిక్కు గలదె ?...' యని వివరించెను.

"వరియింపు వేల్పులయందు నొకని
భక్తి దివిజుల చిత్తంబు పట్టకున్న

నంతరాయంబు పుట్టుఁ గార్యముల కెల్ల" నని యప్రతివిధానంబైన ప్రియావాప్తి విఘాతంబును స్పష్టపఱచినాఁడు.

ఈ సందర్భము నలుని శీలమునకు వన్నెఁదెచ్చిన గీటురాయి ఇదంతయు గమనించుచున్నవారికి 'దమయంతియే యెంతమాత్ర మొప్పుకొనుటలేదు. నలుఁడు దేవకార్యమును నిర్వహించుటలో నెంతమాత్రమును లోటుచేయుట లేదను సంగతి విస్పష్టమగును. గత్యంతరము లేకపోవుటతో నా లతాంగి యా పృథ్వీశుమోముఁ జూచి "మృదుల పరిదేవనాక్షరోన్మిశ్ర మధుర కంఠ కాకు వికార కాకలిక" యలర వెక్కి వెక్కి యేడ్చినది. ఏడ్చుచున్నం గనుంగొని "దివిజోపకార కార్య ప్రయోజన సంస్తంభితంబైన విప్రలంభ వేదనాభరం బప్పుడుద్దీపితంబై "భరింపం గోలక్రికాక తన్నునుం దనవచ్చిన కార్యంబును మఱచి యుచితానుచిత వివేకంబు దప్పి తన పేరు చెప్పినాఁడు. ఎంత యుదాత్త ప్రకృతి యయినను మానవ ప్రకృతికొక యవధి యున్నది. ఆక్షణము వఱకును గార్యభరము వలన నిరుద్ధమైన మానసిక వృత్తి; నిర్వహింపవలసిన దంతయు నిర్వహించి యింక నెట్లును నిష్ప్రయోజనమని తేలిన వెనుకఁ గేవలమొక యబలను నాత్మనీనను విలపింపఁజేయుట కొప్పక పెల్లుబికినది. అది సమంజసమే.

పెల్లుబికిన మానసిక వృత్తిని నిగ్రహించుకొనుట యందే యుదాత్త ప్రకృతి విశిష్టత. కొంత తడవు విభ్రాంతిం బరవశుఁడై యుండి

నను వెంటనే సంప్రాప్త సంస్కారుండగుచు, నమర కార్యము విచ్ఛిన్న మగుట కెంతయు వగచి పశ్చాత్తప్తుఁడగును. నలదౌత్యములో నిది రెండవ ఘట్టము. పేరు చెప్పకయే దౌత్యమును నెఱపుట ప్రథమ ఘట్టము. అవస్థావశంబునఁ బేరు చెప్పుటలో ద్వితీయఘట్టము ప్రారంభ మగును. అయిన దేదో యయినదని యూరకొనక పశ్చాత్తప్తుఁడయి నాఁడు. దూతధర్మము లెఱిఁగిన యా మహారాజు 'ఏమియని తలఁతు రొకో ? సుర' లని విచారించి, 'యాంజనేయాదులఁ బోలనైతిని, 'ఉన్మాదులు సంఘటింపఁగ సమర్థులె యెందును రాయబారముల్'' అని వగచినాఁడు.

ప్రపంచమంతయుఁ గాలచక్ర పరిభ్రమణమున దైవగతిని దగుల్కొని యున్నది. తాను వలచిన రాజకన్య నితరుని పెండ్లియాడునని తాను వేఁడుట యెంత దైవికమో; దౌత్యమును సలక్షణముగా నిర్వహింపవలసిన తాను పేరు చెప్పుకొనుటయు నంతే దైవికమని సమాధానపడినాఁడు. దైవముచేత వచ్చిన చేతనాహాని కెవరేమి చేయఁగలరు? దేవతలకు మాత్రము తెలియదా? దమయంతి మోల మాసగొని తన కుమార్తె యేర్పడఁబల్కఁ జెలికత్తియను బుత్తెంచినది. ఆబోటి తియ్యనివాక్యము లాహ్లాదకరములయ్యెను సురరాజకార్య ఘటనావిఘ్నంబు వాటిల్లుటను నాతని చెవుల కెక్కలేదు. 'అక్కట! దేవకార్యమిటులాఅడిపోవునె' యంచు నాత్మలోఁజింతించుచున్నాఁడు.

నలుని యంతఃకరణము నిర్మలమని పాఠకులెల్లరి హృదయములందును మెదలుచునేయున్నది. అతఁడట్లు చింతించుట యనావశ్యకమని పాఠకుల యంతరాత్మ పలుకుచుండును. సన్నివేశమునట్లు బిగుతుగాఁ గూర్చుటయందే కవి ప్రతిభా ప్రాభవముట్టిపడును. నాయికానాయకుల చింత మాన్పుట యెట్లని తహ తహ పొడముచుండును.

అదిగో ! హంస పథమునుండి కనకహంసము దిగినది. ఇద్దఱి హృదయములకు సన్నిహితులయిననే వారి చింత మాన్పుటకు వీలుండును. అట నున్న సభిజన మొకపక్షమునకుఁ జెందినవారే. కావున నుభయ పక్ష ప్రవర్తకమైన హంసము రంగమునఁ బ్రవేశించినది.

"నీయంతః కరణంబు నిర్మలము వర్ణింపగ శక్యంబే నీ భూరి సత్త్వం" బని వివక్షితార్థ ప్రతిపాదన మొనర్చినది. ఆ పలుకులు హంసవి కావు. కావ్యమునఁ దన్మయుఁడయిన సహృదయునివని వచ్చును. కనుక మరాళం బీక్రియఁ జెప్పియరిగిన వెనుక 'మనమున' జింతాభరములు జనపతికి విలాసవతికిఁ జయ్యనఁ బాసినవి. నలదమయంతుల చింతాభరములతో పాటు సహృదయుని చింతాభరమును బాసినది. కాని యీ కార్యమునకు నలుని బుత్తెంచినవారు దేవతలు. వారి మది కెక్కినఁ గదా నలుని మనశ్శుద్ధి గణన కెక్కుట? ఇచ్చటి పరిస్థితి యంతయు వారు చూచియుండినఁగదా వారతని మనశ్శుద్ధిని మెచ్చునది ? నిజమే.

"...అంతరిక్షగతులై యింతంతటం గానరాక నిగూఢాకృతి నున్న దేవత "లిదియంతయుఁ బరికించుచునేయున్నారు." భావములో నదంభయగు భక్తికి సంతసమొందుఁ డొండె నొండే విధియింపు డిప్పుడ కడిందిగ దండముఁ దప్పఁ గలైనేని" యని నలుఁడు నమస్కరించినాఁడు. నలనాట్యము ముగిసినది. తనయంతః కరణంబు నిర్మలమని సకల భూతాంతర్వర్తనంబులు దెలివిపడియుండు దివ్యహంసము పలికినది. కావున నలనికిఁ జింత వాసినది. నా నేర్పుకొలఁది కార్యమును నిర్మల మగు మనముతో నిర్వహించితినని చేయెత్తి నమస్కరించినాఁడు. దేవతలును "నలుని దూతత్వమిబ్భంగిఁ దెలియఁజూచి తన్మనశ్శుద్ధి నొంది రాత్మలముదంబు" నని కవిస్పష్టము చేసినాఁడు.

ఇప్పటికిఁ గొడవ తీఱినది. దౌత్యము నిర్వహించిన నలుఁడు భావములో నదంభమగు భక్తి కలదనినాఁడు. సకలభూతాంతర్వర్తనంబులు దెలివి పడియుండు హంసము నలుని యంతఃకరణంబు నిర్మలమని యోగ్యతాపత్ర మొసంగినది. అనుయాయివర్గము వారి యోగ్యతాపత్రమేమి విలువ గలదనఁ జనదు. నలదమయంతులు భార్యాభర్తలని "నాఁడె దానానతిచ్చినాఁడు బ్రహ్మ.

తద్వచనమున కన్యథాత్వంబు గలదె" యని హంస బ్రహ్మగారి గజటు నోటిఫికేషను చూపించినది. అదంతయు నేల? ఏసు తాస్వామాది దివిజవరు లీపని కీలకిని బూన్చిరో వారే తన్మనశ్శుద్ధి కాత్మల ముదంబునందిరి. కావున నలుఁడీ యగ్నిపరీక్షలోఁ గృతార్థుఁడయ్యెనని యంగీకరించుట కభ్యంతరము లేదు.

ఇట్లు నాటకీయమగు ధోరణిలో సంవాదాత్మకమగు శైలిలో నీ సన్నివేశము ననితర సాధారణమగు నైపుణ్యముతో శ్రీహర్షుఁడు రచించియుండ నంతకంటెఁ గమనీయమగు శైలిలో ధారాధోరణీ భాసురములగు గద్య పద్యముల నీ సన్నివేశమునకు మెఱుఁగు పెట్టినాఁడు మన కవిసార్వభౌముఁడు.

---

## గ్రంథస్వీకారము–సమీక్ష

(శ్రీ బండారు తమ్మయ్య)

1. విశ్వకవి:–శ్రీ రవీంద్రనాథఠాకూరు శతవార్షిక జయంత్యుత్సవ సంచిక, సంపాదకులు భారతి సమితి అధ్యక్షులు శ్రీ జాస్తి వేంకట నరసయ్యగారు. క్రౌను పుటలు 56+4 వెల 0-12-0

2. వ్యాసవాణి (మూఁడవభాగము) కర్త:—డిటో క్రౌను పుటలు 92 వెల రు 1-4-0

1. రవీంద్ర శతవార్షిక జయంతిని వివిధ రూపకములుగ భారత దేశమందలి సారస్వత సంస్థలు, భాషాసేవకులు నీ నడుమ జరుపుచుండుట సర్వవిశ్రుతము. శ్రీ నరసయ్యగారుకూడఁ దత్స్మారకముగఁ దమ భారతీసమితి పక్షమున వెలువరించిన చిన్ని కానుక యిది. మును ముందు రవీంద్ర బంకిం చంద్రుల జాతీయ గీతములు, పిదప రమారమి 35 మంది కవుల రచనములు పద్యములు, గద్యములు, గేయములు నిందుఁ జేరినవి. నరసయ్యగారు స్వయముగా సంగ్రహముగ రచించిన కవి జీవితము, గురుదేవుఁడు అను వ్యాసములలో విశ్వకవినిగూర్చి, తత్కృతులు, కవిత గూర్చి యుపయుక్త విషయములనేకముగ వివరింపఁబడినవి. "సౌందర్యోపాసన" అను పేర శ్రీ సంజీవిదేవి, "రవీంద్రుని కవిత" అను పేర శ్రీ అనురేంద్రగారలు లిఖించిన గద్య వ్యాసములు తప్పక పఠింపఁదగినవి. కవులు పలువురు రచించిన ఇతరపద్యములు గేయములు కూడ హృదయాకర్షకములుగ నున్నవి

2. వ్యాసవాణి మొదటి రెండు భాగముల గూర్చిన సమీక్ష వెనుకటి సంచికలలోఁ గావింపఁబడినది. అందలి వ్యాసములు విద్యార్థి లోకమునకు, భాషాభిమానులకు నవశ్య పఠనీయములని నివేదించి యుంటిమి. ఈ మూఁడవభాగములో నవ్యాంధ్ర నిర్మాతఁ శ్రీ) వీరేశలింగము పంతులు) దాతలు, భగవద్గీత, బ్రహ్మర్షి (రఘుపతి వేంకటరత్నము నాయుఁడు) దావూదు కావ్యములు, సాధూజీ, (ఎస్సేని సుబ్బి

హ్మాణ్యము గాంధిపథానువర్తి, సౌందరనందము, కవి కథ, గురు దేవుఁడు (విశ్వకవి)" అనుశీర్షికలు గలసారస్వతాధ్యాత్మిక వ్యాసములు పది గలవు. చివరి మూఁడు రవీంద్రుని జీవితమునకు సంబంధించినవి. వెనుకటి భాగములందు కన్న నిందుత్తమ వ్యాసము లెక్కువగ నున్నవి. విద్యార్థులకు భాషాసేవకులకు నివి యానందదాయకములు, అవశ్య పఠనీయములు నయియున్నవి.

8. శబ్దోత్పత్తి శతకము :— కర్త విద్వాన్ శ్రీ కోగంటి దుర్గా మల్లికార్జునరావుగారు విశ్రాంతాంధ్రోపాధ్యాయులు, పామర్రు గుడివాడ తాలూకా కాపురము పుటలు 20 వెల 0-4-0.

కవిగారు నేఁటి యున్నతపాఠశాలా పరీక్షా పరిణాళికకుఁ జేరిన ప్రకృతి, వికృతి, శబ్ద రూపాంతర నానార్థ విజ్ఞానమునకయి, విద్యార్థుల ధారణా సౌలభ్యమును బ్రయోజనముగాఁ గొని యింతకుమున్న ప్రకటించిన తత్సమ, రూపాంతర, నానార్థశతకములపయి సమీక్షలను గతసంచికలలోఁ గావించియుంటిమి. ఇది కూడ నాకోవలోనే శబ్దముల వ్యుత్పత్త్యర్థములను గూర్చి కందములలో రచితమయిన శతకము- విద్యావంతులు, భాషాభిమానులు శ్రీ వాకాటి పెంచలరెడ్డిగారి కంకితము. పూర్వోక్తశతకములవలెనేయిదికూడ విద్యార్థులకుఁ బాఠశాలో పాధ్యాయులకు నాదరణీయమని చెప్పనవసరము లేదు. మచ్చునకు రెండు పద్యములు.

క॥ కలమెక్కి పోవు కతమునఁ
గలమరియని చెప్పినారు గావ్యార్థ విదుల్
కలరావ మొనర్చుటచేఁ
గలరవమని పల్కినారు కవితాధిపుల్

క॥ కీలెఱింగినట్టి వానిని
గీలరియని చెప్పినారు కీర్తితపురుషుల్
కీలము గలిగిన కలమునఁ
గీలియనుచుఁ బల్కినారు కీర్తిధనాఢ్యుల్

4. పద్యముకుందమాల :— కర్త కఱ్ఱాత్రిమూర్తి కవి పశ్చిమ వంగరాష్ట్ర ఆంధ్రసాహితీ ప్రచారసభా ప్రచురణము-టిటాఘురు, (తల్పుకూరుపోస్టు) క్రౌను పుటలు 32 వెల 0-8-0 లు. కవిగారు దేవాంగకులజులు, యువకులు-శ్రీకాకుళము జిల్లా నరసన్నపేట వాస్తవ్యులు, విద్వాన్ శ్రీ కఱ్ఱి సాంబమూర్తిశాస్త్రి, వేంకటసుబ్బరాయ గురువర్యుల శిష్యులు, సరసకవితాసంపన్నులు ప్రస్తుతము హుగ్లీ జిల్లా మహేశనగరములో నున్నవారు. వీరు రచించిన "భీమ. శతకము" గూర్చిన సమీక్ష మున్నొకపరి యీ పత్రికలోఁ గావించియుంటిమి. సంస్కృతమున శ్రీ కులశేఖరాళ్వారు మహాకవి రచియించిన ముకుందమాల, విష్ణు స్తోత్రములలో నుత్తమస్థాన మాక్రమించి కొన్న విషయము సర్వవిదితము. దానికాంధ్రానువాదము లిదివఱలో నే పెక్కు వెలువడినవి. కవిగారు తమ భక్తికొలఁది గూర్చిన ప్రస్తుతానువాదము మృదుమధురశైలిలో సరసతరముగఁ గూర్పఁబడినది. ప్రకాశిక యనుపేర నాంధ్రసాహితీ ప్రచార సభపక్షమున శ్రీ విశ్వనాథకవిగారు రచించిన పీఠిక కవిగారి యీ విహాత్మానువాద వైలక్షణ్యము నావశ్యకతను బ్రశంసించుచున్నది. మచ్చునకు రెండు పద్యములు.

ఉ॥ పుట్టువుఁ జావు నాఁబడు తెవుళ్ళఁబెఁ జిక్కని మందటంచుమున్
దిట్టలు యాజ్ఞవల్క్యముఖదివ్యతపోధనులాత్మసౌఖ్య సం।
ధట్టద కృష్ణనామక సుధన్ గనిపెట్టిరి; దానిఁ గ్రోలిపోఁ
గొట్టుకొనుండు తత్ప్రబల ఘోరరుజన్ గనుఁడయ్య కూరుముల్

శా॥ ఏ విష్ణుపదాబ్జ సంస్మరణ మొక్కింతేని లేకున్నచో
దాన ప్రక్రియ భస్మహోమమగుఁ దీర్థప్లావనంబుల్ ద్విప
స్నానంబౌ, వ్రతముల్ నిరర్థమవు నామ్నాయానులాపంబర
ణ్యా నీరోదన మౌను నమ్మహితునే ధ్యానింతు నారాయణున్

| | | | | |
|---|---|---|---|---|
| (5) | కర్షక ప్రబోధము క్రౌను పుటలు | 25 | వెల 0-8-0 | కృతికర్త :- శ్రీ చలసాని లక్ష్మీనారాయణవర్మ, కల్వపాముల కృష్ణాజిల్లా |
| (6) | కల్పవల్లి (ఖండకృతి) ,, ,, | 72 | వెల 0-12-0 | |
| (7) | శ్రీ వర్మోపదేశము ,, ,, | 22 | వెల 0-8-0 | |
| (8) | శ్రీ మల్లేశ్వర స్తోత్రము పాకెటు సైజు పుటలు | 32 | వెల 0-2-0 | |

5. 'కర్షకయువకా' యను మకుటముతో 120 కందపద్యములలో వ్యవసాయ వృత్తికి సంబంధించిన వివిధోపయుక్త విషయములతో, నీతులతో నిది కూర్పఁబడినది. చక్కని ధారతో మృదుమధుర పదములతో రచననడచినది. విద్వాన్ కోగంటి దుర్గామల్లికార్జునరావు, ఉభయభాషాప్రవీణ సూరపనేని శోభనరావు, డాక్టరు త్రిపురనేని వేంకటేశ్వరరావుగారలు రచించిన తొలిపలుకు, కావ్యపరిచయము, రచనాత్మక కల్పన, అను పేరిగల పీఠికలు కృతికి ముఖాలంకారముగ నలరారుచున్నవి. ఆస్థానకవి కీ॥ శే॥ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి కవిసార్వభౌముల సదభిప్రాయము నిందున్నది. పాండితీసంపన్నులయ్యుఁ బోతనామాత్యకరణిఁ దమవలె నేకర్షకవృత్తి జీవనముగాఁగొనినయువకులు శ్రీ నెల్లంకి రాజారావుగారికిఁ గవిగారు దీనినంకిత మొసర్చుట ముదావహము. గ్రంథమామూలాగ్రమునందఱు చదివి హర్షింపఁదగినదిగానున్నది. మచ్చునకు మూఁడు పద్యములు.

1. క. కుక్కుటము తెక్కవిదలిచి
కొక్కొరకోయనుచు నిక్కి కూసినతోడన్

ప్రక్కదిగి పాలి కాపున
గ్రక్కునరమ్మనుచుఁబిలువ కర్షకయువకా.

2. క. నిరతంబుఁ బచ్చియాకులు
దఱచుగనిడి గుంటలందుఁ దడుపు చునీటన్
ముఱుగునటు మట్టిఁగల్పిన
గఱవగునే యెరువునీకుఁ గర్షకయువకా.

3. క. ఎడ్డేడ్చిన వ్యవసాయము వృద్ధికిరానేరదన్నవృద్ధులసూక్తుల్
బుద్ధిందలంచి మేపినఁ గద్దుసుమీనీకుసుఖముకర్షకయువకా.

6. ముఖ్యముగాఁ బ్రసిద్ధకవులు, పండితులు,కళాకారులు, దేశసేవకులుగూర్చి యప్పుడప్పుడు కవిగారు పద్యరూపమునఁగావించిన ప్రసంగములే యీఖండకృతిరూపమును దాల్చినవి.కృషీవలుఁడు,మఱి వనినిని, స్వచరిత,మహిళమున్నగు శీర్షికలతో రచితములయిన యితర పద్యములుగూడ మఱికొన్ని యిందుఁగలవు. దేశసేవకులు ఆచార్య గోగినేని రంగాగారికిది యంకితము. ఇతరకృతులవలెనే యిదికూడ ధారాళమయినధారతో నలరుచున్నది. మచ్చునకుఁ గొన్ని పద్యములు.

బ్రహ్మర్షి (వేంకటరత్నము నాయఁడు) గూర్చి

1. కడుపు కక్కుఱ్తికై సేయు పడుపువృత్తి
గాసివడఁజేసె నీగుండెగాయనప్పుడు
మాన్పునీ పక్షపాటు మా మానసములఁ
దవులు రఘుపతి వేంకటంత్నవర్య.

2. పొట్టి (శ్రీ)రాములు గూర్చి
ఓర నీయాత్మ బలిదానమగుటతోడ
తెలుఁగు జనములకైక్యమ్ము బలముగలిగి
బలయుతంబైన జాతీయ ప్రభుతనొంది
యాంధ్రరాజ్యంబు స్థాపింపనర్హులైరి.

3. మహిళనుండి
ఆర్యావర్తంబందునఁ
గార్యాచరణం బొనర్చు కాలంబులలో
భార్యాభర్తలని స్నే
హార్యులు మునుగౌరవించి రమ్మా! మహిళా!

7. ఆత్మబోధకముగ రచితమయిన "నరోపదేశము" నీతిశతకములకోవకుఁ జెందిన యొక సరసకృతి. వేమన సుమతీశతకపద్యముల వలె నిందలిపద్యములు చాలవఱకు త్తమ నీతిబోధకములుగా నలరారుచున్నవి. అందఱవశ్యము పఠింపఁదగియున్నవి. శ్రీ బి. వి. నరసింహారావుగారు "ఒకటి రెండుమాటలు" అని పేరితో రచించిన తొలిపలుకు, శతావధాని హరి సత్యనారాయణశాస్త్రి, కొగంటి దుర్గామల్లికార్జునరావు, అమరేంద్ర, కవిరాజు కొండపీటి వేంకటకవి యొసంగిన సదభిప్రాయములిందుఁ జేర్చఁబడినవి. కల్పాముల పంచాయతీబోర్డు అధ్యక్షులు శ్రీ వెల్లంకి సీతారామయ్యగారి కిది యంకితము. మచ్చునకుఁ గొన్నిపద్యములు

రోషము పసపూరుషులకు। వేషము పసఁగూర్చుచూడు వేశ్యల కెల్లన్
భూషలు పసపూఁబోఁడికి। భాషకుఁ బసనొసఁగుఁదెలుఁగుపలుకులువర్మా!
పేదలయిన చదువరులకుఁ। గాదని లేదనక కడకుఁ గాసౌకటయినన్
మోదముతో నొసఁగినచో। గోదానముకన్న మేలు గూర్చును వర్మా.
నేలకు నింగికి నేస్తము। పాలకునీటికిని నేస్తభావం బెపుడున్.
మీలకుఁ బ్రాణముజలములు। స్త్రీలకునుబూలకునుగల్గుస్నేహమువర్మా

8. గుంటూరుజిల్లా కాకాని గ్రామములో వెలసిన మల్లేశ్వరస్వామివారిపయి గూర్చిన 32 మత్తేభ శార్దూలవృత్తములిందుఁగలవు ఈక్షేత్రమును గామితార్థసిద్ధికై భక్తులు తఱచు సేవించుట సుప్రసిద్ధము. మచ్చునకొకపద్యముఁ జూచునది.

సంతానార్థము నీగుడిన్ వరుసగా సాష్టాంగముల్ సేయుచున్
స్వాంతంబందున భక్తిభావపరులై హల్లాఱు పంచాక్షరీ
చింతన్ జేయుచు వంతవీడి నిదురన్ జెందంగ స్వప్నంబులోఁ
గాంతావర్గముకిత్తువంటవరముల్ కాకాని మల్లేశ్వరా !

9. ప్రియవిలాపము:-కర్త : శ్రీకృష్ణభిక్షువు కాగిను పుటలు 48 వెల రు 1-0-0 ఇదియొక యపూర్వపద్యకృతి. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారికిఁ బ్రేమపూర్వకముగ నంకితము. కృతికర్త, కృష్ణభిక్షు సాంకేతిక నామముతో వ్యవహరింపఁబడు ఓరుగంటి వేంకటకృష్ణయ్య B. A. B. L. గారు బహురూపక విజ్ఞానసంపన్నులు. బ్రహ్మచర్యాశ్రమస్థులు. ఆధ్యాత్మికానుభవజ్ఞులు. వీరు, వీరిమిత్రులొకరు అరుణాచల క్షేత్రములో శ్రీ రమణమహర్షి యాశ్రమములోఁ దత్సేవాసక్తులయి యున్నదినములలో వీరిమిత్రుఁడు ప్రేమించి పెండ్లియాడఁదలఁచిన ప్రేయసి పెండ్లిజరుగకముందే దైవికముగ నిర్యాణమును జెందినది. మహర్షి సాన్నిధ్యమందున్నను నాతఁడు ప్రేయసి యకాలమరణము వలనఁజిత్తశాంతిలేక యామెకై "లలితస్మృతి" యను పేరిచిన్నికబ్బము రూపమున విలపించిన విధములను గవియే తానుభావించి మరలఁ గవి భూమికతోఁదానే యాతనివిలాపమున కూటవాక్యములు పలుకుట, తన్మూలమున గొంతవఱకాత్మ దూఱటనొందిన తుదకు శ్రీ రమణమహర్షి యనుగ్రహమువలనఁ బరలోకమునఁబరాశక్తిలో లీనమైన ప్రియురాలి నాంతరంగికదృష్టిలో వీక్షించి శాంతినొందుటయుఁదలి యితివృత్తము. అపూర్వవిలక్షణాభిధానములో విరచితమయిన యాకృతినందఱవశ్యము పఠింపఁదగును. ఇందుమొత్తము150 పద్యములున్నవి. సరసభావసమృద్ధములు. శైలిసరళము. ధారాళము. శ్రీద్వివేదిసూరిగారుఆముఖమను పేరితో రచించిన పీఠికలో నిది ముక్తకమను కావ్యభేదమునకుఁ జెందునని చెప్పి

యందలి రసవిచారవిషయమై సరసమయిన చర్చ సాగించినారు. నాయికమరణమును నాయకుఁడు స్వయముగా నెఱిఁగియుండుటనాతని కామెనుగూర్చిన ప్రత్యాశ లేదనుటస్పష్టమనికావునఁగవి దిశలియుపదేశ బలమున నాయకునకుఁ దుదకు లభించిన యలౌకిక ప్రేయసీ ప్రణయానుభూతి కేవలజ్ఞానేంద్రియలభ్యమే యగుట విప్రలంభముగాక శాంత్యనుప్రాణితమగు కరుణమే యాకృతియందలి యంగిరసముగా నెన్నఁదగునని నిశ్చయించినారు. ఆనిశ్చయముతో మేముగూడ నేకీభవించెదము. మచ్చునకుఁ గొన్నిపద్యములు.

జీవితమే యెడారి యిటజీర్ణతయున్ జననంబు బుగ్గలా
భావికుహూహ్వయమెయ్యెడలఁ బాంథుఁడు సాగినఁ జేరువంతకున్
వేవుటగన్పడున్ ; బ్రిదుకువిహ్వలమిట్టియపార పంథలో
మావులుగాఁగఁ గోరికలుమానవులేఁగెద రే దిప్రాప్యమో (ప 9)

కొట్టితివినన్ను మూలాన గట్టిదెబ్బ
నైన నీకృపసేనోర్వ లేనె రమణ
ఎంతపిడుగేని దానికి నఁతమూండు
పుడమిగర్భమె కఠినము తోడఁ జీల్చ. (ప 27)

కన్నులు కానవు వీనులు
మిన్నకయేఁ వినుచునుండు మెలఁతయెమదిలో
నున్నది భూతవిధమ్మున
మన్నయినను విడువఁబోదు మానిని రమణా ! (ప 45)

స్వామీ ! నన్నుచుదేర్చు కల్పకమ! నేఁ జాతున్ గరంబంజలిన్
ఈమార్గమ్మిదికొత్తనాకునయి నీవిందే ప్రకాశింపఁ జేఁ
గా మేనన్ బొదలెన్ వికాసములు నేఁగన్యాపి శేషస్థితిన్
గామింతున్ రసమందు;నాదయితతోఁ గ్రాంఛేంతున ద్వైతమున్ (ప45

10. ఈశ్వరశతకము:-కర్త శ్రీకృష్ణభిక్షు: క్రౌను పుటలు 21. వెల 0-8-0 ఇదియొకరీతి మకుటముగలది కాదు. చాలపద్యములు కేవల మీశ్వరా! యను మకుటముతో నున్నను మఱికొన్ని సోమేశ్వరా మహేశ్వరా! గుహేశ్వరా నాట్యేశ్వరా! ప్రజేశ్వరా! ఇత్యాదిగా భిన్న భిన్న మకుటములతో నున్నవి. కవి యాధ్యాత్మిక విద్యాసంపన్నుఁడయినను "తథాపిభక్తిస్తరుణేందుశేఖరే" అని భర్తృహరి చెప్పినట్లు సహజముగా శివభక్తియే యెక్కువగాఁ గలిగినవాఁడు. పరాశక్తి నీతఁడు "నీలసరస్వతీ" రూపమున వీక్షించి తన్నామముననే వ్యవహరించుట పరిపాటి. అందుచేతనే "ఓం శ్రీ నీలసరస్వత్యైనమః భక్తిపూర్వక మిదమ్ సమర్పితమ్" అని కృతినామె కంకితము గావించెను. పద్యములన్నియు వివిధములయిన భక్తిభావముల వెల్లివిరియుచున్నవి. ఉదాహరణమునకై రెండు పద్యములు.

పిడికెఁడుకూటినిమ్ము పదివేలుగ నెంచెద నీయశస్స్రితిన్
మడులుగఁ దీర్చి తెల్గుపొలమారఁగ నించెద; ముక్తకంఠతన్
నుడివెద శ్రావ్యసుందరమనోహరగీతుల నాఁటినాఁటి కా
పిడికెఁడు నాకు నీయు; పరివేద యొసఁగ్బునదేమి యీశ్వరా !

బసవని బూదిఁ బాముముల భైక్ష్యమునల్లని కాళి నగ్గి నీ
మెసవిన వెగ్గలంపు విసమెన్నిన నీదయఁ గుర్రింకులాడరే ?
వసమతి నిద్దురన్ మునుఁగు బాలుఁడు మాధవుఁ డేమొసంగునే
నిసుఁగునకేనిఁ దాసిడెనె? నెయ్యము తెల్లని నీదె యీశ్వరా !

11. భ్రమరాంబాస్తోత్రమంజరి:-కృతికర్త కవిరత్న, సహస్రావధాని, శ్రీరాం వీరబ్రహ్మకవిగారు రిటైర్డు పండితులు. నోబిలు కాలేజీ బందరు. డెమ్మీ పుటలు 23 వెల 0-4-0 శ్రీ వీరబ్రహ్మకవిగారు, సుప్రసిద్ధపండిత కవులు. బహుగ్రంథకర్తలు; గద్యపద్యకావ్య

ములు, నాటకములుఁగాక నానారాజన్య విజ్ఞానచరిత్ర, పీఠికాపుర సంస్థానచరిత్ర, పల్లవరాజ చరిత్రమున్నగు పెద్దచరిత్ర గ్రంథములు గూడఁ వ్రాసినవారు. వృద్ధులయ్యు నతులిత ధారణాశక్తితో నేఁడు గూడ "సహస్రావధానము" గావించుచున్న మేధావులు. ప్రకృతకృతి దేవీస్తుత్యాత్మకమయినది. ఇందు మొదటఁ బ్రార్థనయనుశీర్షిక క్రింద నమూరని యేఁబదిపాదములుగల యుత్పలమాలికయు, అనంతరము భ్రమరాంబాస్తుతియను పేరితో మూఁడు మత్తకోకిలలు, ఆతరువాత భ్రమరాంబాస్తోత్రమంజరి యను పేర భ్రమరాంబా యను మకుటముతో 130 కందపద్యములు, పిమ్మట శ్రీశైల మల్లేశ్వరస్తుతి పూర్వకమగు నొక శార్దూల వృత్తమునున్నవి. ఇట్లు వివిధ రూపస్తుత్యాత్మకముఁగ రచితమగుటచేతనే దీనికి స్తోత్రమంజరి యని నామకరణము గావింపఁబడినట్లు తోఁచుచున్నది. మొత్తముగ్రంథమంతయు భక్తిప్రబోధకముగ నున్నది. మచ్చునకుఁ గొన్నిపద్యములు.

క. జనకుఁడు బలియుండగు పు
 త్రునివీడఁడు; తల్లిమాత్ర దుర్బలసుతుతీ
 డనియట్లె, దుర్బలుఁడు భ
 క్తిని వీడకుమమ్మననుమదిఁ భ్రమరాంబా !

క. మల్లయ్యకుఁ జెవుడాయెను
 అల్లనఁగొండెక్కియుంటివాయెను నీవో
 తల్లీ! నామొఱవెటు విూ
 యుల్లంబుల కెక్కఁజెప్పు మోభ్రమరాంబా !

క. "దాసునితప్పులు దండము
 తోసరియనునట్లుదుష్కృతుఁడ నైనను నీ
 దాసుఁడనని నీ సంస్తుతిఁ
 జేసిన సమఁబ్రోవుమమ్మ! శ్రీ భ్రమరాంబా!

12. పారిజాత సౌరభ్యము:-(పద్యకృతి) కర్త : శ్రీ వక్కలంక లక్ష్మీపతిరావుగారు ఎం. ఏ. ఆంధ్రోపన్యాసకులు శ్రీ కోనసీమా భానోజీ రామర్సు కళాశాల అమలాపురము. క్రౌను పుటలు 82+21. వెల 1—37 న. పై.

శ్రీకృష్ణ దేవరాయలు శత్రురాజయిన గజపతితనయ తిరుమల దేవిని వివాహమయి యామెతోఁ గాఁపురము సేయుచున్న దినములలో నొకనాఁటిరేయి నిద్దుర మబ్బులో నామె కాలు ప్రమాదవశమున దన శిరమునకుఁ దగులగా నది యవజ్ఞగా నెంచి యామెయెడ నాతఁడనురాగ విదూరుఁడయియున్న యెడరు నెఱింగి యామెతో నరణపుఁగవిగావచ్చి రాయలయాస్థానమందలి యష్టదిగ్గజములలో నొక్కఁడయిన ముక్కుతిమ్మనార్యుఁడు పారిజాతాపహరణ ప్రబంధమును రచించి రాజాస్థానమున వినిపించుట, రసజ్ఞుఁడయిన రాయలా కావ్యరచనమందలి వ్యంగ్యోద్దేశమును గ్రహించి తన యకార్యమునకు సిగ్గువడి తిరుమలదేవియెడ మరల బద్ధానురాగుఁడై సుఖంబుండుట తెనుఁగు నాఁట సుప్రసిద్ధముగానున్న కథలలో నొకటి. ఆ కథనే గయికొని శ్రీ లక్ష్మీపతిరావుగారు కొంత వినూత్నశక్తితోఁ బ్రస్తుతకృతిని రసోల్లాస కలితముగ రచించి తమ కళాశాలాస్థాపకులగు శ్రీ భానోజీ రామర్సు జమీందారుగారి కంకితమొసంగిరి. కథ ప్రాఁతదైనను "తఏవపదవి న్యాసా స్తసేవార్థ విభూతయః । తథాపిభవతినవ్యం । కావ్యంగ్రథన కౌశలాత్" అను సూక్తి కనుగుణముగ ననల్పమగు శిల్పనైపుణ్యముతో నీకృతి నవ్యతనే వెలార్చుచున్నది. ప్రవేశికయను పేరితోఁ గవిసమ్రాట్టు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు రచించిన పీఠిక సరసతరముగనున్నది. "ఈ చిన్న కావ్యములోఁ గథ ప్రాఁతదైనను గల్పన క్రొత్తది. కల్పనయనఁగాఁ బాత్రపోషణాదికములు" అని శ్రీ సత్యనారాయణగారు సెలవిచ్చి చివరను "ఇదియొక మధురమైనకృతి,

శిశిరమైనకృతి,సురభిళమైన కృతి. కథనట్లు తీర్పు నేర్పు ప్రకటించుట కవియందుదాత్తమయిన లక్షణము'' అని ప్రశంసించినారు. వారితో మేముగూడ నేకీభవించి కవికభ్యుదయము నాకాంక్షించుచున్నారము.

కథా సంఘటనములో నేమి పాత్ర సంభాషణములలో నేమి కవి యా కృతియందసదృశనైపుణ్యమును ప్రదర్శించియుండుట ముదావహము. ఇందెక్కువగా మెఱయునది శిల్పమే. కృత్యారంభమునఁ బ్రథమోల్లాసము రెండవ పద్యమున గజపతి వర్ణనముననే యది వింతగాఁ దొణికిసలాడిన విధము పరికింపుఁడు.

"ఆ కళింగుఁడు గజరాజ సార్థనాముఁ । డెపుడు నరసింహకృష్ణు లెక్కింపకుండు । నెంతమృగరాజుకాని రాదెదుటి కన్న । స్థైర్యమున నేఁగు మదకరీంద్రమ్ము మోల''

రాయలు గజపతినాహవరంగమున నిర్జించి కాక, మంత్రి తిమ్మరుసు రాజనీతి నిపుణతమూలముననే వెనుకనుండి పెరటిదారి నాతని యంతిపురిఁజొచ్చి స్వగృహముననే గజపతిని సకుటుంబముగ బందినొనర్పు భావికథావిధానము నిందుఁ గవి సరసముగ వ్యంగ్యముగ గర్భితమొనర్చినాఁడనుట విస్పష్టము. ఇట్లు గజపతి వశ్యుఁడయిన యనంతరమాతనితోఁ దిమ్మరుసు తిరుమల దేవిని రాయలకిచ్చి పెండ్లి యొనర్పుమని యుద్బోధించి సమ్మతింపఁజేసిన సందర్భమున వారిరువురకు జరగిన సంభాషణములలోను, వివాహానంతరము శయ్యాగృహమున రాయలను దనఖడ్గముతో సంహరించి పితృఋణముక్తిని బడయుమని గజపతి తనయ తిరుమలతో మంతనములాడుపట్టుల నిరువురకు జరిగిన సంవాదములను గవి చక్కని నైపుణ్యమును మెఱయించినాఁడు. ఆ ఘట్టములిందుఁ బ్రత్యేకముగఁ బ్రశంసింపఁదగియున్నవి. గ్రంథనామమూలాగ్రము సరళ సుందరశైలితో నలరారుచు నందఱు నవశ్యము పఠించి యానందింపఁదగినదిగానున్నది.

గ్రంథమందలి కథకుఁ గవియుంచిన గ్రంథనామమునకు నా దృష్టిలోఁ బొందికయంతగాఁ గనరాకున్నది. గ్రంథాంతమునఁ జంద్రోదయవర్ణన సందర్భమందలి "పథ వెంటంబడి పారిజాతసుమన స్సౌరభ్య * ముల్ నిండునా ప్రభు చిత్తమ్మునఁబోలె సర్వదిశలన్, రాగమ్ము నిండారె న, ల్లథ నిన్నాళ్లుగలంచి రాజు మదిలో లజ్జించె; రేరాజు నా, ప్రభునిల్లాలి గలంచుటన్ జడిసి దూరంజొచ్చె మేఘమ్ములన్" అను పద్య ప్రథమ పాదమందలి గీత గీసిన పదములిందుకు సమర్థకములు కాఁగలుగునా!

బండారు తమ్మయ్య.

13. మరుగుపడిన మాణిక్యాలు : రచయిత : డాక్టరు బి. రామరాజుగారు వెల రు 15/లు. ఇంత వెల వారికమీఁద ప్రకటింపనై యున్న మాణిక్యరాశికంతకునో, పీఠికతో కలిపి 110 పుటలు డెమ్మీ సైజులో గోల్కొండ పత్రికనుండి పునర్ముద్రితమైన యీ గ్రంథ మాత్రమున సంతరించిపెట్టిన పదునాఱు మాణిక్యములకో నాకాసందియము తీఱుట లేదు. కాని సహృదయులైన రామరాజుగారు, మఱుగు పడియున్న అమూల్య సాహిత్యసేవకులపై నమితమైన సానుభూతితో, ఈ మాణిక్యములను బయటఁబెట్టుట, యెంతయు ప్రశంసింపఁదగిన విషయము. తాళీదళ సంపుట ప్రకరకాంతారమునఁబడి పురుగులుపట్టి అట్టలైయున్న తాటికమ్మలను వెడఁదీసి, వాని నాశ్రయించియున్న క్రిములను దొలఁగఁజేసి, అక్షరములు పోల్చుకొనుచుఁబోయి, చిట్టచివర కేదో విధముగఁ గవిపేరు గ్రంథ నామము తేల్చుకొని, ఆతఁడే కాలము వాఁడగునో గుర్తించుటకు పడరాని పాట్లుపడి, ఆవిషయమును బాహ్య లోకమున కందిచ్చుట యాతనా బహుళమై కష్టసాధ్యమైన పని. తాటాకు పుస్తకములు తడవు వారికిఁగాని దీనిలోని శ్రమయెట్టిదో తెలియరాదు. ఆంధ్రసాహిత్య పరిషత్తులోనుండెడి తాటియాకు పుస్తకములతోఁ బరిచితిగల నేనీశ్రమ నెఱుఁగుదునుగాన, రామరాజుగారి

యీ వాఙ్మయసేవ అమూల్యమైనది, సాహిత్యరంగమున నడుగువెట్టు యువకుల కిది మార్గదర్శకమని నేను హృదయపూర్వకముగఁ దెలుపుచున్నాను.

ఇంత వఱకు మాటఁపడియుండి యిపుడు రామరాజుగారు రచించిన వ్యాసరూపమున గోల్కొండ పత్రికలోఁ దలయెత్తి,గ్రంథ రూపమున బజారునకువచ్చిన యీమాణిక్యములు తెలంగాణములోఁ దేజరిల్లినవి. కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నమైన తరువాతఁ దెలంగాణములో నిధులెన్నియో యణఁగియేయున్నవి. అట్టి వానిలో సారస్వతనిధి యొక్కటి. ఎవ్వరికిఁ గాని కట్టని యీ నిధి సముద్ధరించుట తమ కర్తవ్యమని భావించి, ఆ యా కవులను గాలగర్భమునందణఁగి పోకుండ వెలుఁగులోనికిఁ గొనివచ్చు శ్రీరామరాజుగారి కృషి నిరంతరాయముగ కొనసాగిన, నది యాంధ్రభాషకు నమూల్యాలంకారము కాఁగలదని తలఁచుచున్నాను. సహృదయులయిన సారస్వత సేవకులు, గోల్కొండ పత్రికాధిపతులవంటి యుదారులు వారికిఁదగిన ప్రోత్సాహము నొసఁగుట ప్రశంసనీయము. ఇట్టి గ్రంథములు వెలువడుట ఆంధ్రభాషాభివృద్ధి కెంతేని యావశ్యకమని, అది భావికి మార్గదర్శకమని నా నిశ్చయము.

చి. పాపయ్యశాస్త్రి.

14. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వము: ప్రథమ భాగము. మదరాసు విశ్వవిద్యాలయము-తెలుగు ప్రచురణము. సంఖ్య 15. రచయిత శిష్టా రామకృష్ణశాస్త్రిగారు. పుటలు 775.

వాఙ్మయారంభమునుండి క్రీ. శ. 1375 వఱకు నుండెడి కవుల చరిత్రమున కిది నిష్పాక్షికము సమగ్రము నయిన విమర్శనాత్మకగ్రంథము. తెలుగు కవుల చరిత్రము నీవఱకుఁ బెద్దలు కొందఱు తమ తమకందిన చారిత్రక సారస్వత సామగ్రిలను బట్టి

కాలనిర్ణయాదికమును గావించుచు రచించియున్నారు. కాని వానిలో నీ గ్రంథమునకుఁ జేకుఱిన సమగ్రత కానరాదనియే చెప్పవచ్చును. ఒక్కొక్క కవికి సంబంధించిన కులగోత్రాది నిర్ణయమునఁ గాని, రచనా తారతమ్యమును గూర్చి కాని, తన నాఁటివఱకు గ్రంథరూపమున, వ్యాసరూపమున వెలువడిన యభిప్రాయములన్నిటిని గూలంకషముగాఁ బరికించి, వానిలోని సాధక బాధకములను నిరూపించి, యుక్తిసహముగాఁ దమకుఁ దోఁచిన విషయమునుఁ దెలుపుట, యీ రచనలోఁగల ప్రత్యేకత.

ఈ వాఙ్మయ చరిత్రమును గూర్చి యీ వఱకు రచన సాగించిన వారిలోఁ బెక్కురు తమ తమ యభిమానములను బట్టి యాయా కవుల, వారి కాశ్రయ దాతలయిన ప్రభువుల మంత్రుల చారిత్రక వ్యక్తుల స్వరూప స్వభావములనునిర్ణయించుచు వచ్చినారు. దానితోఁ బ్రతికృతిని గూర్చి, కృతికర్తలనుగూర్చి, కృతిభర్తలనుగూర్చి వాదోప వాదములు చెలరేగి, ఆంధ్ర వాఙ్మయ చరిత్ర గ్రంథములు గహనములు కాఁజొచ్చినవి. రామకృష్ణశాస్త్రిగారు, ఏ కవినిగూర్చిగాని, ఏ చర్చనీయాంశము విషయమునఁగాని, ప్రత్యేకాభిమానము వహింపక, ప్రత్యేక విషయమును గూర్చి యీవఱకుఁ బెద్దలు వ్రాసిన విషయమును శ్రద్ధగఁ జదివి, అందలిసారమును సంగ్రహించి తెలిపి, తమకుఁ దోఁచిన నిర్ణయము కావించుచు వచ్చినారు. ఈ విధమయిన రచన యీ గ్రంథమున కొనసాగి యుండుటచే, నిది సర్వవిధముల నాంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వ మనఁదగియున్నది.

ఈనాఁడు విమర్శకులలోఁ గొందఱు, తమకుఁ గావలసిన విషయము నీ వఱకుఁ బెద్దలు రచించిన రచనలనుండి గ్రహించియుఁ దాము సొంతముగ దానిని సృజించినట్లు, ఊహించినట్లు తెలుపుట

పరిపాటియయినది. ఈ పద్ధతి లోకమును వంచించుటయే. అట్టి పనిని శ్రీరామకృష్ణశాస్త్రిగారి గ్రంథమునం దెచ్చటను గావింపకుండుట ప్రశంసనీయము. తామే విషయము నెచ్చటనుండి గ్రహించియుండిరో యావిషయములన్నిటిని అనుబంధసూచికలోఁ దెలిపియుండుట దీనికి నిదర్శకము. ఈ పద్ధతిలో నీ సర్వస్వము మిగిలిన భాగములు కూడ వెలువడిన ఆంధ్ర వాఙ్మయ చరిత్రమునకు, ఇంతవఱకు నేర్పడియున్న కొఱఁత చాల వఱకుఁ దీఱిపోవును. ఇట్టి అమూల్యమైన కృషి తమ తెలుఁగుశాఖచేఁ గావింపఁజేయుచుఁ నీ తీరయిన యుత్తమ గ్రంథము ప్రకటించిన మదరాసు విశ్వవిద్యాలయము వారి వాఙ్మయసేవ యత్యంతము కొనియాడఁదగియున్నది. అచిరకాలములో రచయితలయిన శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు, తరువాతి భాగములను సైతము అచిరముగఁ బ్రకటించి, ఆంధ్ర వాఙ్మయ చరిత్రమునకు సమగ్రమైన సామగ్రిని ఆంధ్రపాఠకలోకమున కందింపఁగోరుచున్నాను.

చి. పాపయ్యశాస్త్రి.

---

# శ్రీనాథుఁడు స్త్రీలోలుఁడేనా ?

శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి.

శ్రీనాథుని జీవితచరిత్రను వ్రాయుచు కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమ యాంధ్రకవుల చరిత్ర ప్రథమ ముద్రణమున నిట్లు రచించిరి. "ఇతఁడు శివభక్తుఁడు. యౌవనదశయందు శృంగారనాయకుఁడై స్త్రీలోలుఁడై తిరిగెనని చెప్పుదురు. అది యెంతనిజమో కాని, వయసుముదిరిన తరువాత భక్తుఁడై యుండెనని యాతఁడు రచించిన గ్రంథములే సహస్రముఖముల ఘోషించుచున్నవి." (పుట. 112) కాని వారిచే సంస్కరింపఁబడి విపులీకరింపఁబడిన ముద్రణములో పై వాక్యముల తర్వాత "ఆ కాలమునందు భక్తికిని నీతికిని నంతగా సంబంధమున్నట్టు కనఁబడదు. ఒకఁడఖండ శివభక్తుఁడును గావచ్చును. జార శిరోమణియై యఖండవేశ్యాభక్తుఁడును గావచ్చును" (పుట581) అని వ్యాఖ్యానపూర్వకమైన కొంత మార్పుచేసియు, "అవసానదశయందిట్టి కష్టములకెల్లను గారణము యౌవనదశయందుఁ గామవశముచేత స్వేచ్ఛగా విహరించి దేహమును ధనమును జెడఁగొట్టుకొన్న పాపఫలము తక్క వేఱొక్కటి గానరాదు." (పుట 543) అని మఱియొక క్రొత్త యూహచేసి యిట్లు వివరించినారు. వీరేశలింగముగారు "శ్రీనాథునిపై మోపఁబడిన దోషము స్త్రీ వర్ణనము చేసినందుకును విటపురుషుల దుర్వర్తనముల వెల్లడించినందుకునుగాదు. స్త్రీలోలుఁడై వయః కాలమున విచ్చలవిడిగాఁ దిరిగి కాయమును ధననికాయమును జెడఁగొట్టుకొని కష్టపడవలసిన వృద్ధదశను దెచ్చుకొన్నందుకు. శ్రీనాథుఁడు వేశ్యాప్రియుఁడని యాలవిని గూర్చి వ్రాసిన వారందఱును నైకకంఠ్యముతోఁ జెప్పుచున్నారు. వేశ్యలపొందు ధనైకలభ్యమని యెల్లవారును నెఱుఁగుదురు. శ్రీనాథుఁడు మహారాజులయొద్ద సాస్థానకవియై యమితధనము నార్జించుటయే కాక, వివిధ దేశాధీశుల సభలకరిగి కనకాభిషేకాదులను బొందిన మహానుభావుఁడు. కనకాభిషేకము

సామాన్యమైనది కాదు. జలమువలె శిరస్సుపైని కనక కలశములతో సువర్ణ ముద్రలతో స్నానము చేయించిన ధనమే బహు సహస్ర రూప్యముల విలువగలదై యుండును. కనకాభిషేకము చేసిన మహా రాజు కవిశిరోమణి శిరస్సుపయిని గ్రుమ్మరింపఁబడిన సువర్ణ సహస్ర ములను కవికియ్యక తాను మరలఁ గైకొనియుండడు. రసిక శిఖామణి యైన కవికియ్యఁబడిన యటువంటి ధనరాశి వేశ్యల వలలలోఁ దగులు కొన్నప్పు డల్పకాలములో నదృశ్యమగుట వింతకాదు.” (పుట549.) ఈ రచనలను బట్టి కవి చరిత్ర ప్రథమ ముద్రణాకాలము (1887) నకును, సంస్కరణ ముద్రకాలము (1917)వరకును గల మధ్యకాల ములో వీరేశలింగముగారికి శ్రీనాథుని స్త్రీలౌల్య విషయమునుగూర్చి పూర్వముగల సందేహాభిప్రాయమునూతి దృఢపడుటయేకాక, దానికి గల ముఖ్యకారణములు గూడ నూతనవని స్పష్టమగుచున్నది. పూర్వము శ్రీనాథుని రచనలనుబట్టి యతఁడు స్త్రీలోలుఁడని వారభి ప్రాయపడఁగ, నిపుడు వాని యవసాన దారిద్ర్యదశను బట్టి తమ యభిప్రాయమును నిశ్చయపఱచుకొనినారు. ఇందుచే క్రీడాభిరామము లేక వీథినాటకమను శృంగారపద్యములు శ్రీనాథుని రచనలు గావని వీరేశలింగముగారభిప్రాయపడి, “దుర్నీతిపోషకములైన యీ యనుచిత పద్యరచనమును శ్రీనాథకవి కారోపించుట యాతని కపకీర్తి కలిగిం చుట” (పుట 532) “ ఈ యసభ్యగ్రంథముయొక్క కర్తృత్వము నూరక యారోపించి మనవారు కొందఱు శ్రీనాథుని ముంపఁదలఁచు కొన్న దుర్యశః పంకమునుండి యసఁడిది శ్రీనాథకవిత్వము కాదని సిద్ధాంతమయినప్పుడే లేచి బైలఁబడి గట్టెక్కి కృతార్థుఁడు కాఁగ లుగును” (పుట 537) అని వ్రాసిరి. ఇందుచే శ్రీనాథుడు స్త్రీలోలుఁ డని యూహింపఁబడుటకుఁగల ముఖ్యకారణములు. (1) అతఁడు వార్ధకమున దరిద్రస్థితిలోనుండుట. (2) క్రీడాభిరామము లేక వీథి

నాటక పద్యములను రచించుట (3) క్రీడాభిరామేతరగ్రంథములలోఁ గల శృంగార పద్య రచనలును కాన నివి యతని స్త్రీలౌల్యమును సమర్థింపఁగలవేమో విచారింపవలసియున్నది.

వార్ధకమున దారిద్ర్యము:- యౌవనమున నైశ్వర్యవంతుఁడైన శ్రీనాథ మహాకవి దైవవశమున దారిద్ర్య మనుభవించుటకుఁ గారణమతని స్త్రీలౌల్యమే యని యూహించుటకుఁదగిన యాధారము గానరాదు. తాను సంపాదించిన ధనరాసులన్నియు వేశ్యలకే వినియోగించెననుటకుఁ దగిన ప్రమాణమువేదు. ఐశ్వర్యవంతుఁడు దన ధనమంతయుఁ గోల్పోవుటకు దుర్వ్యసనములు మాత్రమే కారణములు కాఁజాలవు. ఒకవేళ విద్యావిహీనుఁడైన పామరునకట్లు గల్గినను విశేష విద్యావంతుడును లోకజ్ఞుఁడు గౌరవనీయుఁడునైన శ్రీనాథునకట్లు గల్గెననుట సమంజసముగాను. దానికిఁ దగిన ప్రమాణము గూడలేదు. లక్ష్మి చంచలమైనది. లక్ష్మీసరస్వతుల కత్తకోడండ్రవైరమందురు కదా. అందుచే విద్యావంతుఁడైన శ్రీనాథుడు విధివశమునఁ దన గ్రహబలము చాలక పరమదరిద్రుఁడైపోయినాఁడు. అందుచేత నాతని దురదృష్టదినములలో బొడ్డుపల్లెగ్రామమును గుత్తకుఁ బుచ్చుకొని వ్యవసాయము చేయఁగఁ గృష్ణవఱద వలన పైరుపంటలు పోయి, శిస్తు గూడకట్టలేక సంకటపడినాఁడు. ఇది తన దురదృష్టము కాదా. కృష్ణకు వఱదలు రాక, బొడ్డుపల్లె పుష్కలముగాఁనుండియున్నచో శ్రీనాథునకు దారిద్ర్యముండకపోఁగాఁ గొప్ప యైశ్వర్యమే దక్కెడిదికదా. ఇది యతని విధి వైపరీత్యముకాదా ? దాన నతని దారిద్ర్యము వేశ్యాలోలత్వమున సిద్ధించెననుట సరసముగానున్నదా ? బొడ్డుపల్లె వృత్తాంతము సంభవింపనిచో నాతని దారిద్ర్య వృత్తాంతము మనకు బోధపడడిదేకాదు. బొడ్డుపల్లె వ్యవసాయమునకుఁ దాను దాఁచుకొనిన ధనమంతయు వినియోగించి యుండవచ్చును. దాని వలన గొప్ప

లాభము వచ్చుఁగదా యని యాతఁడాశించెను. కాని దైవము ప్రతికూలించెను. దనకున్న ధనమంతయు వ్యవసాయమునకు వినియోగించుటచే నేడు పందల టంకములు సిస్తుకట్టలేక సంకటపడియుండును. శ్రీనాథుడు. ఆతని బొడ్డుపల్లె వ్యవసాయ మొక వ్యాపారము. (Speculation) వంటిదైనది. మృచ్ఛకటిక నాటకములో చారుదత్తుడు పరులకు దానములు చేయుటచే దరిద్రుఁడైనట్లుగా, శ్రీనాథుఁడు కాశీఖండమున రచించికొనినట్లు.

గీ॥ అతిథి కడునల్పుఁడైనను నధికుఁడైన, నింటికే తేరఁ బ్రియ
మందు నెవ్వఁడేని వాని గౌరవ మదిగౌరవంబుగాని, కాదు గౌరవ
మాకారగౌరవంబు.

బంధుమిత్రాతిథుల సత్కరించి, వారితోఁ దాను భోజనప్రియుఁడై పిండివంటలతో నిత్యము భుజించి సుఖజీవనమును జేసినవాఁడు, కాని లుబ్ధుడై ధనమును దాఁచినవాఁడు మాత్రముగాఁడు. తన సుఖజీవనమునకు రాజులు మంత్రులు ధనవంతులు, గూడ తోడ్పడి దన విద్యను గౌరవించి సత్కరించి పోషింతురని భావించి ధైర్యముతో సుఖముగా ననుభవించుచు నుండెనేకాని, యెన్నఁడు దిగులు చెందలేదు. కాని కాలవైపరీత్యమునకుఁ దానేమియుఁ జేయలేకపోయెను. ఉదార స్వభావుఁడైన చారుదత్తుండెట్లు దరిద్రుఁడయ్యెనో దైవదుర్విపాకమున, శ్రీనాథుఁడుగూడ నట్లే దరిద్రుఁడైనాఁడు. చారుదత్తుని దారిద్ర్యమునకు మనమెట్లు జాలిపడుదుమో, యట్లే శ్రీనాథుని దారిద్ర్యమునకుఁ గూడ మనము జాలిపడవలసియుండగా, నెదురుదూషించుట నిందమోపుటయుచితమా ? శ్రీనాథుఁడు తనకు మిగిలియున్న ధనమంతయు వెచ్చించి బొడ్డుపల్లెను వ్యవసాయము సాగింపకయుండినచో నేదోయొక విధముగ గంభీరముగనున్న దానితోఁ

దిరుచు వార్ధకమును గడుపుకొనెడివాఁడు. స్వతంత్రజీవనముచేయ నార్జనకు బోయి దుఃఖమును దెచ్చుకొనినాఁడు.

ఏడు నూర్లు టంకముల సిస్తును చెల్లించఁదగిన భూమిని వ్యవసాయము చేయుటకు, సుమారే మూఁడు నాలుగువేల టంకంబులైనను బట్టునుకదా. తాను సంపాదించిన ధనములో ననుభవించినది పోఁగా వార్ధకమునకే మూఁడు నాలుగువేల టంకంబులకంటె నెక్కువగా దాచికొనఁజాలఁడుకదా. దానిని శ్రీనాథుఁడు బొడ్డుపల్లె సాగునకు వినియోగించి భంగపడియుండును. కాక, బొడ్డుపల్లె సాగునకు నాలుగు వేల టంకంబులును సిస్తునకు నేఁడు నూర్లటంకంబులు గూడ నష్టపడినను నింకను విశేషధనమును శ్రీనాథుఁడేల దాచలేకపోయెనని యతనిని దూషించుట సమంజసమా ? అందు కతనిపై నిరాధారముగా వేశ్యాలౌల్యము నారోపింపనగునా? మఱియుఁ గుటుంబికుఁడైన శ్రీనాథుఁడు శుభాశుభకార్యములొనర్చి కొంత ధనము దానికై కూడ వ్యయము చేసియుండవచ్చునుకదా! పోషకులగు దాతలు పోయిన తర్వాత కూడ తనకున్న ధనములోనే తినవలయుఁగదా! కాన వార్ధమునకేమి విశేషము మిగిలియుండును. గొప్ప యుద్యోగములు వేసి, కేవలము న్యాయార్జనముతో జీతము వలన మాత్రమే, గౌరవ ప్రదముగ జీవించు నేఁటికాలమున నున్నతోద్యోగులు మాత్రము విశ్రాంతి వేతనము (Retive) పొందిన తర్వాత నేమి భాగ్య భోగ్యముల ననుభవింపగలరు ? కాన శ్రీనాథుని విషయమునఁగూడ నంతయే కల్గియుండును. గాని విశేష మేమియు నుండియుండదు.

మఱియు శ్రీనాథుని యందు స్త్రీలోలత్వము నారోపించుటకు ధూర్జటి, యల్లసాని పెద్దన కవుల విషయమై కల చాటువులు గూడ లేవు. ధూర్జటినిగూర్చి.

చ॥ "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కులకేలకల్గెనీ
యతులిత చాతురీ మహిమ"

అని కృష్ణదేవరాయ లడుగఁగాఁ డత్సభాసదులలో నొకరు,

"హా, తెలిసెన్ భువనైన మోహ నో
ద్ధత మధురాధరోదిత సుధారసధారలు గ్రోలుటంజుమీ"

అని చానింబూర్తిచేసిరనియుఁ బల్కుచు, దానిచే ధూర్జటికవి వేశ్యా సహితుఁడై యుండెనని యూహింపఁబడినది. అట్లే అల్లసాని పెద్దనను కృష్ణదేవరాయలొకప్పుడాశువుగాఁ గవిత్వమును జెప్పుమని కోరఁగా నాకవి యిట్లనెనఁట.

చ॥ నిరుపహతి స్థలంబు రమణీయ ప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మకింపయిన భోజన, ముయ్యెలమంచ, మొప్పు త
ప్పరయు రసజ్ఞులూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకినఁగాక యూరక కృతుల్ రచియింపు మనంగ శక్యమే"

ఈ పద్యము వలనఁ బెద్దనకవి ధైర్యస్వాతంత్ర్యములు బోధపడుచున్నను నతని స్త్రీలోలత్వము గూడ ద్యోతకమగుచున్నది. కాని శ్రీనాథుని విషయములో నిటువంటి చాటువులు గూడ లేకపోయినను నతఁడు స్త్రీలోఁడని యూహించుట నిరాధారమైనది కదా. ఈ సందర్భమునకు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దమ శృంగార శ్రీనాథము 301వ పుటలో నిట్లు వ్రాసిరి. "శ్రీ కందుకూరి వీరేశలింగముగారీ సందర్భమున శ్రీనాథుని గొంత యవగణించిరి. అతఁడు వార్థకమున దారిద్ర్య మనుభవించుట పాపఫలమని, కర్మవిపాకమని చెప్పిరి. అట్లు చెప్పుట వారికే చెల్లినది." అని వీరేశలింగముగారినట్లు నిరాదరించినను ప్రభాకరశాస్త్రిగారు మాత్రము శ్రీనాథుని స్త్రీ లౌల్యమును గూర్చి తక్కువగాఁ జెప్పలేదు. ఇది కొడలికిఁ జెప్పి యత్తచేసినట్లున్నది. అది కూడ నిరాధారమైన యూహయే, కాన దానిని గూడఁ బరా

మర్మింతము. శ్రీనాథుని కుటుంబస్థితినిగూర్చి తెలుపుచు ప్రభాకర శాస్త్రిగారు శృంగార శ్రీనాథమున 34వ పుటలోనిట్లు వ్రాసిరి. "ఈ విషయము గుర్తింప నాధారమేదియుఁ గానరాదు. నిరంతరము దేశాటనము సేయుచు 'విషయ లౌల్యమున' వర్తించుచు వచ్చినవాఁడగుటచే నితనికి సంసారసందర్భమగు నానందము లభింపకపోయెడిదేమో యని సంశయముగల్గుచున్నది." అను దానిలో శ్రీ శాస్త్రిగారి సంశయమే కాని నిశ్చయము కాదనియు, దానిని గూడ గుర్తింప నాధారమేమియు లేదని వారే వ్రాసినపుడు, వారట్లూహించుటలో ప్రయోజనమేమిమో తెలియకున్నది. ఇఁక శ్రీనాథుఁడు శాలివాహన సప్తశతి రచించెనని తెలుపు ఘట్టమున "ఆ గాథలు నానావిధ నాయికా నాయకాదుల శృంగార వృత్తులను జమత్కరించుచు, భిన్న భిన్నములుగానున్నవి. శృంగారము వీనియందుఁ బొర్లిపోవుచుండును. తన ప్రాయమునకుం 'బ్రవర్తనము'నకు ననురూపముగా శ్రీనాథుఁడీ కావ్యము నీ వయస్సునం దెనుఁగునకుందార్చెను" అని 69వ పుటలో శాస్త్రిగారు వ్రాసిరి. హాలుఁడు ప్రాకృతములో వ్రాసినగాథా సప్తశతిలోని స్వరూప స్వభావములు శృంగారమయములు. దానిలోని భావములను శ్రీనాథుడనువదించినాఁడు. 'నూనూగుమీసాల నూత్న యౌవనమున, శాలివాహన సప్తశతి నొడివితి'నని యతఁడే తెలుపుకొనినాఁడు. కాని తన ప్రవర్తనమునకు ననురూపముగా" నని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వ్రాయుటకుఁ దగిన ప్రమాణము లేదు. అది కూడ వారి యూహయే. పాపపుణ్యము లెఱుఁగని పసివాఁడగు శ్రీనాథుని ప్రవర్తనపై నిట్టి యపోహలు కల్పించుట శ్రీ ప్రభాకరశాస్త్రికే చెల్లినది. అంగీకరించినందులకా యీ పాపము. మూలము రచించిన హాలునిపై లేని కళంకమాంగీకరించిన శ్రీనాథునిపై నాయీ నింద"

విద్వత్కవియైన శ్రీనాథుఁ డెన్నియో సంస్కృత ప్రాకృత శృంగార కావ్యములను జదివియుండును. అందఱికి వలెనె నితనికిని సహజముగ శృంగారరసము నచ్చియుండును. కాళిదాసువలెనే శృంగార రసాభిమాని శ్రీనాథుఁడు. కవికృత కావ్యములనుబట్టి యింతకంటె నూహించుటకు వీలులేదు. అంతమాత్రముచే నితఁడు స్త్రీలోలుఁడనుటకుఁ బ్రమాణము చాలదు. తరువాత శృంగార శ్రీనాథము 145వ పుటలో "దాక్షారామము, పలివెల, పీఠికాపురము... నాయా స్థలములందనకు సమకూడిన యనుభవానందాదులు వెలికిఁ దోఁచునట్లు పెక్కు పట్టుల కవనము రచించినాఁడు ....యౌవనము నిండారి, ప్రౌఢమై, నిర్భరమై, యీకాలమం దీతని నెన్నో యున్నత భోగముల ననుభవింపఁ జేసినది." మఱియు 151వ పుటలో "భీమఖండమురచించిన కాలముననే శ్రీనాథునకు దాక్షారామ రామాసమాగమాది సౌభాగ్యములు పుట్టినవి." ఇవి యన్నియు శ్రీ ప్రభాకరశాస్త్రిగారి యూహలే కాని, చక్కని ప్రమాణ మొక్కటియు లేదు. ఒక కవి శృంగారరసమయ పద్యములు విశేషముగ వ్రాసినంత మాత్రమున నతఁడు స్త్రీలోలుఁడనుట యతివాదమగును; అయితే సంస్కృత కవులగు కాళిదాస శ్రీహర్షుల గూర్చియో మనవలె ఆంగ్లకవియగు షేక్స్పియ రనేక హత్యా విషయిక నాటకములను రచించెను. అందుచే నతఁడు హంతకుఁడని నిర్ణయింపవచ్చునా ? డ్రైడన్ కవి పరిశుద్ధుఁడని ప్రసిద్ధి కాని కాలప్రభావము వలన ననేక క్షుద్రశృంగార కావ్యములను వ్రాయలేదా ? దాక్షారామ వేశ్యల యాథార్థ్యమును గూర్చి శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు తన "శ్రీనాథుఁడు శృంగారియా" యను గ్రంథమున వివరముగాఁ దెల్పినారు. కాన నంతకంటె విశేషముగ నెవరు చెప్పనవసరము లేదు. ఈ సందర్భమున నొక విషయము చెప్పవలసి

యున్నది. శ్రీనాథునికి శృంగారరస వర్ణనాభిలాష యెంత యధికమనఁగా నవసరము లేకపోయినను గూడ జగన్మాతయైన పార్వతీ కుచముల నొక విశిష్టతతో వర్ణింపక విడువఁడు. ఇట్టివి కాశీఖండ భీమఖండ హర విలాసములలోఁ గుప్పకుప్పలుగాఁ గోచరించును. ఉదాహరణమునకు భీమఖండమున, త్రిపురాసురవధ వర్ణనమున (ఆ.IV. 131.ప).

కం. ముక్కంటి మేరుచాపం, బెక్కిడి సారించెఁ బన్నగేంద్ర గుణంబున్
దక్కువ హిమగిరి కన్యక, క్రిక్కిఱిసిన కుచము లలము కేలుందమ్మిన్.

మఱియు శివుఁడు దాక్షారామముఁ బ్రవేశించు ఘట్టమున (ఆ. V-43ప.)

తే॥ దాఁటెఁ బ్రాసాద దేహళి దర్పకారి, ధరణిధర రాజపుత్రికై దండ యొసఁగ
నమ్మహాదేవి కుచమండలమ్ము సోఁకి యంగకంబులఁ బులకంబు లంకురింప.

ఇట్టివనేకము గలవు. పార్వతీదేవినిఁగూర్చి యే యనవసరముగా నిట్టి శృంగార వర్ణనలఁ జేసిన శ్రీనాథుడు సామాన్య సందర్భములలో నవకాశము దొఱకినపుడు జాఱవిడుచునా? వీనివలన నాతని శృంగార భావ వర్ణనాప్రియత్వము మాత్రమే ద్యోతకమగును కాని, యింత మాత్రమున నాతఁడు స్త్రీలోలుఁడనుటలో నౌచిత్యము లేదు. ఈ విషయమున శ్రీనాథుడు కాళిదాసునితో సమానుఁడే, కాని యంతకంటె విశేషమేమియు లేదు. కాన దాక్షారామ రామావర్ణనమునఁ దనకు సమకూడిన యనుభవానందాదులు వెలికిఁ దోఁచునట్టు కవనము రచించినాఁడు శ్రీనాథుఁడని భావించుట సముచితముగాదు. అట్లే భావించవలయుచో, శ్రీ ప్రభాకర శాస్త్రిగారు రచించి "మూన్నాళ్ళ ముచ్చట" అను పద్యకావ్యమందలి విషయమునుగూడ 'దనకు సమకూడిన యనుభవానందాదులు వెలికిఁ దోఁచునట్టు కవనము రచించి

నాఁడ'ని తలంచుట సమంజసముగానుండునా ? అట్లే శ్రీనాథుని విష యమునందుఁ గూడ. కాన నది అతివాదముగా నుండును. తర్వాత శృంగార శ్రీనాథమున 301వ పుటలో "అట్లు దేశాటనము చేసియుఁ బ్రతిభా వ్యాపారమున నఖండపరిశ్రమము గావించియు, వైషయిక వర్తనమున నగ్రికోటి నధిష్ఠించియు, మొగ్గతిలఁబడక చిరజీతము సాగించుకొనఁ గల్గినవానికిఁ దిన్ననిమేలయిన యాహార విహారములు పొసఁగకయెట్లు?" అని వ్రాయఁబడినది. ఇది కూడ శ్రీ ప్రభాకర శాస్త్రిగారి యూహాప్రపంచములోనొకటి. దేశాటనముచేయు విద్యా వంతు లిట్లే యుందురా? విద్యావంతులైన రాష్ట్రోద్యోగాధికారులు (Touring district & Presideucy officers) దేశాటనము చేయు చుందురు సామాన్యముగా. వారు పరస్త్రీలోలురై వర్తింతురా? కావల సినచోఁ గుటుంబముతోఁగూడ దేశాటనము చేయుదురు వారు. శ్రీనా థుడుగూడ నట్లుచేసెడివాఁడేమొ యని యేల భావింపరాదు. అతని కన్నిచోట్ల గౌరవ సౌకర్యములు లభించుచుండెడివికదా. విజయనగర మున కేఁగి నపుడు,

శా॥ కుల్లాయుంచితిఁ, గోఁకచుట్టితి, మహాకూర్పాసమున్ దొడ్గితిన్
వెల్లుల్లిన్ దిలపిష్టమున్ మెసవితిన్, విశ్వస్త వడ్డింపఁగాఁ
జల్లాయుంబలిఁ ద్రావితిన్, రుచులుదోసంబంచుఁ బోనాడితిన్
దల్లీ, కన్నడరాజ్యలక్ష్మి, దయలేదా? నేను శ్రీనాథుఁడన్॥

అని యతిదీనముగాఁ జెప్పుకొనినాఁడే శ్రీనాథుఁడు. మఱియు సర్వజ్ఞ సింగభూపాలుని కొలువునకుఁ బోయినపుడు,

సీ॥ దీనారటంకా ల..... .. .. ..... .....

గీ॥ ఎటుల మెప్పించెదో నన్ను నింకమీఁద, రావుసింగమహీపాలు
క్ష్మీవిశాలు

నిండుకొలువున నెలకొనియుండునీవు, సరససద్గుణ నికురంబ !
శారదాంబ !

అనియు వినయ భయభక్తులతోఁ దెలుపుకొనిన శ్రీనాథుఁడు విషయ వాంఛలకు నాశించునా? దేశాటన సందర్భమున. ఇంక పల్నాటికిఁ బోయినపుడందలి యసహ్యతనే వ్యక్తీకరించినాఁడుకద. చాటుపద్యములలో, అక్కడనే బహు నీచముగా ప్రవర్తించినాఁడని కొన్ని యసహ్యపు చాటుపద్యములతని కంటకట్టినారు కొందఱు. సౌందర్యాభిమానియగు శ్రీనాథుఁడట్టి నీచశృంగారమునకుఁ దలపడునని భావించుటయుచితమా? విశేష విద్యావంతుఁడు, గౌరవ ప్రతిష్ఠలు సంపాదించుకొనినవాఁడుకదా. కంచియే చేను మేయునా? పూర్వకాల మిప్పటివలె పైట భేషజము లోపల కుళ్లుగానుండినచో సదాచార విషయమున నల్లరిచేసి సంఘబహిష్కారము చేసెడివారు. అందులో విద్యావంతుఁడును, గౌరవ ప్రతిష్ఠలు గలవాఁడు. అసూయాపరులు ద్వేషులు నతని నల్లరిపాలుచేసి రాజులకుఁగూడ దుర్బోధలు చేయుదురు. బాణుని గూర్చి హర్ష మహారాజునకు ద్వేషము గూర్పలేదా యతని విరోధులు. అట్లే శ్రీనాథుని వదలియుండరు. అట్టి ప్రమాణము లేమియు శ్రీనాథునిపట్ల గోచరింపవు. మఱియు శ్రీనాథుఁడు "బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడవు;..... ఈశ్వరార్చన కళాశీలుండవు .....బ్రహ్మజ్ఞాన కళానిధానమవు" అని వర్ణింపఁబడినాఁడు. ఇట్టి శ్రీ దేవతా వరప్రసాదులు స్త్రీలోలురగుచో నశింతురని సామాన్యముగానందురు. అట్టివారు పరిశుద్ధాత్ములుగానుండవలయునని భావము. పై మూఁడు లక్షణములుగలవాఁడు పవిత్ర శీలుఁడు గాఁదగునని యెంచవలెను గాని స్త్రీలోలుఁడనుటకు వీలుండదు.

తర్వాత శ్రీనాథుని చాటుపద్యమగు,

శా॥ అక్షయ్యంబగు సాంప(సంబు)రాయుని తెలుంగాధీశ! కస్తూరికా
భిక్షాదానము సేయురా! సుకవిరాడ్బృందారక శ్రేణికిన్ (స్వామిన్)
దాక్షారామ పురీవిహార (చళుక్యభీమ) వరగంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్॥

ఇందలి కుండలీకరణములోనివి శ్రీప్రభాకరశాస్త్రిగారి సంస్క-రణ పాఠములు. ఈ చాటుపద్యమును పురస్కరించుకొని శాస్త్రిగా రిట్లు వ్రాసిరి. శృంగార శ్రీనాథమున "శ్రీనాథునికి వైషయిక వాంఛ లత్యున్నతములు, భోగపరాయణత మెండు. ప్రౌఢనిర్భరవయః పరి పాక కాలమగుటచే నాతఁడప్పుడు శృంగారరస సముద్రమునఁ దెప్ప దేలుచున్నాఁడు. దాక్షారామాప్సరోరామల యొడళ్ళపయి బుగ బుగలొల్పుటకని తెలుంగురాయుని గస్తురికోరినాఁడు. ఏమి కోరిక! ఉచ్చైర్దశనుండునారి కప్పు డిట్టి యచ్చరల చెలికారము గౌరవము సించుచుండెడిది గావలయు! పయి చాటువు శ్రీనాథునిది కాకపో వచ్చుననుటకు వలను పడదు." ఈ పద్యమును గూర్చి ప్రభాకర శాస్త్రిగారిట్లు దురభిప్రాయపడినారో శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రిగారు "శ్రీనాథుడు శృంగారియా" యను గ్రంథమున 23, 24 పుటలలో చక్కగ వివరించినారు. ఇంతకంటె నధికముగా నీ విష యముపై చెప్పవలసిన పనిలేదు. కాని "తెలుంగాధీశ! కస్తూరికా భిక్షాదానము సేయురా!" అని యొక రాజునుగూర్చి 'రా' అని యాజ్ఞాపించుట న్యూనతకదా! అది రాజు సహించునా! అదియు యాచింపబోయినపుడా! ఇది యుచితమా! శ్రీనాథునకు మర్యాద తెలియదందుమా? లేక మర్యాదతోఁగూడిన పదజాలమును పద్య మున ఛందోబద్ధముగఁ గూర్పలేకపోయెనందుమా? అట్లు భావిం చుట శ్రీనాథుని విషయములో సంభావ్యముగానుండునా? విచారింపఁ

మును రచించుటయెట్లు అని మఱియు శృంగార శ్రీనాథమున 145 వ పుటలో "శ్రీనాథుని కవితా చకోరికను బంచారామములందును, బల్వోలయందును బౌరిభేందుబింబ ప్రతిబింబచంద్రికా చమత్కారములు మూఱలొసగి చొక్కించి దక్కఁగొన్నవి" అని వ్రాసి శ్రీనాథుఁడు వేశ్యాలోలుఁడని నిరూపించిరి. ప్రభాకరశాస్త్రిగారు పైపద్యము రెండ పూఁడీ అన్నయమంత్రి సౌందర్యము సుందరులైన స్త్రీలందఱకు గమనీయమై కామనీయమైనదను విషయమే తెలుపునుగాని, అన్నమాత్యుఁడుగాని, లేక వానిని వర్ణించిన శ్రీనాథుఁడుగాని స్త్రీలోలుఁడను భావము స్ఫురించుట పొసగదు. 'సఖలు సుభగః యమంగనాః కామయన్తి' యను సూక్తి చొప్పున, సుందరులందఱుఁ గామింపఁదగిన యాకార సౌష్ఠవముగలవాఁడే సౌందర్యవంతుఁడు అట్టిసౌందర్యము అన్నామాత్యునకుఁ గలదని తెలుపుటయే పై పద్యభావము. పై పద్యము వలన అన్నామాత్యుఁడుగాని, లేక శ్రీనాథుఁడుగాని స్త్రీ లోలురని యెట్లు భావవింపవలయునో యూహింపరాకున్నది. అట్లే యగుచో నైషధమున నలుని వర్ణించు సందర్భమున,

తే. వానిఁగలలోనఁగానని వనజముఖియు
 వానిమూర్తిఁ జేరోఁ—ని మానవతియు
 వానిగా నాత్మ భావించి వరునిఁగవయ
 నప్పళింపని సతియు లేదయ్యె నచట.

అని రచింపఁబడినది. దీనివలన నలుఁడును శ్రీహర్ష కవియుఁగూడ స్త్రీ లోలుఁడని ప్రభాకరశాస్త్రిగారి వాదమునననుసరించి యూహింపవలసి యున్నది. కాని నలుఁడట్టివాడు గాఁడని తిరస్కరిణీవిద్యచే దమయంతీ శుద్ధాంతః పురమున సంచరించునపుడు తటస్థించిన సంఘటననుబట్టి నిర్ణయింపఁబడినది. తిలకింపుఁడు తృతీయాశ్వాసము 94 పద్యమును 97 వచనము.

చ. ఉరువడినేఁగుచోట నొకయుగ్మలి యొల్లెచెఱంగు మేదినీ
శ్వరుని భుజావిభూషణము వజ్రములం దవులంగఁ బాఱినన్
విరిసెను నీవిబంధ మది విస్మయమందఁగఁ గోడిభామినుల్
పరిహాసనంబొనర్పఁ బతిపాపభయంబునఁ గంపమొందఁగన్.

వ. ఇవ్విధంబునం బరస్త్రీ పరాఙ్ముఖుండును జగన్మోహనాకారుండును నగు నారాజకుమారుండు శుద్ధాంతకాంతామధ్యంబున నిర్వికారుండై చరించుచు'' దీనినిబట్టి సౌందర్యవంతులందఱచేఁ గామింపఁ బడినను నలమహారాజు పరస్త్రీ పరాఙ్ముఖుఁడును, నిర్వికారుఁడును, పాపభయంబునఁ గంపమొందువాఁడుగనే పాత్రిశీలము చిత్రింపఁబడెఁ గాని స్త్రీలోలుఁడుగ వర్ణింపఁబడలేదు. ప్రభాకరశాస్త్రీగారి వాదము ప్రకారముగ ఇటువంటిదే కదా బెండపూడి 'అన్నయమంత్రినిఁ బంచారామములందుఁ బల్వేలపురిన్ బూర్ణేందు బింబాననల్' కామించిరన్న శ్రీనాథుని వర్ణనకూడ. రెంటికి భేదము లేదుకదా. పరస్త్రీలు చపలబుద్ధితోఁ బ్రేమించినను బెండపూడి అన్నయమంత్రి స్త్రీలోలుఁడనియెట్లు నిర్ణయింపఁదగును. ఇట్లే మనుచరిత్రమున ప్రవరుని వర్ణనయందుఁ గూడఁ గలదుకదా. ప్రథమాశ్వాసము 52 వ పద్యము.

ఆ. వానిచక్కదనము వైరాగ్యమునఁ జేసి
కాంక్ష సేయు వారకామినులకు
భోగబాహ్యమయ్యెఁ బూచిన సంపెంగ
పొలుపు మధుకరాంగనలకుఁ బోలె.

స్త్రీలుగాని, పురుషులుగాని, యితరులు దన్ను కామించినను తాము కామింపనివారి శీలమే శ్రేష్ఠముగా పరిగణింపఁబడును గాని, వశ్యులగుచో గౌరవోదాత్తత లుండవుకదా, పాత్రిశీలమున ఇట్టిచో నేయవకాశమును లేక బెండపూడి అన్నయమంత్రియు, శ్రీనాథుఁడును గూడ స్త్రీలోలురని పైపద్యమునుబట్టి భావించుట యే మాత్రము

సరసముగా లేదు. ప్రభాకర శాస్త్రిగారు ఆంధ్రసారస్వతములం దనేక క్లిష్టసమస్యలను పరిష్కరించిన ప్రజ్ఞావంతులే కాని, కొన్ని సామాన్యమైన లఘువిషయములలో తప్పటడుగులు చాలసార్లు వేసిరి. ఇది బహువిచిత్రమైన విషయము కదా. ఇందుచేతనే 'ప్రమాదో ధీమతామపి' అను నార్యోక్తి యుండఁగా 'ప్రమాదో ధీమతామేవ' అని కొందఱు దానిని సంస్కరింపవలసి వచ్చినది.

మఱియు ప్రభాకరశాస్త్రిగారు క్రీడాభిరామ పీఠికలో 47వ పుటలో నిట్లు వ్రాసిరి. "సత్ప్రబంధములందుఁ గూడ నిట్టి రచనలను సంకోచింపక నిరంకుశముగాఁ జొప్పించుటకు శ్రీనాథుని శీల మెట్టిదై యుండునో యించుక యోజించిన గోచరించును. శివరాత్రి మాహాత్మ్యమును జెప్పు పవిత్రగ్రంథమున సంస్కృతమూలమున లేని చండాలాంగనా బ్రాహ్మణబ్రువసంభోగ సంభాషణమునంత సంపూర్ణముగా వర్ణించియే తీరవలెనా? కాశీఖండమున ననుచితముగాఁ గంచియఱవతల ముచ్చటలను బచ్చిగా వర్ణింపవలసినదే? హరవిలాసమున శివలింగోత్పత్తి కథ నంతకంటె సభ్యముగా సాగింపఁదగదా? సత్ప్రబంధములందే లేని జంకుఁగొంకు లింక రసికుల కొఱకే రచితమయిన క్రీడాభిరామమునఁ జూడఁబడునా!" అని శివరాత్రిమాహాత్మ్యమును విశదపఱుపఁగోరి శ్రీనాథుఁడందలి నాయకుఁడగు సుకుమారుఁడను సుందర బ్రాహ్మణుని పరమ నికృష్టునిగాఁ బాత్రపోషణము చేయనెంచి చండాల స్త్రీతో వ్యభిచార మొనర్చినట్లు అతివిపులముగా వర్ణింపవలసి వచ్చినది. ఇది పాండురంగ మాహాత్మ్యమున నిగమశర్మ నికృష్టవర్తనను వర్ణించుట వంటిది. అందుచే నెంత నికృష్టునిగాఁ జేయ సాధ్యమో సుకుమారునంత నీచముగా పాత్రపోషణ చేయవలసి వచ్చినది. ఇందుచే దాని మా మాహాత్మ్య ముత్కృష్టముగా నుండునని యుద్దేశము.

ఇంతమాత్రముచే కవి స్త్రీలోలుఁడనియు, నాత్మానుభవమునే వర్ణించెనని భావించుట పట్టి పిచ్చియగుఁగాక. అట్లే యగుచో రామకృష్ణుఁడును, విరాటపర్వమున కీచకుని విటవర్తనమును మూలమునందు కంటె విపులముగా వర్ణించిన తిక్కనయు స్త్రీలోలురని భావింపవలసినదే! కాశీఖండమందలి యరవెతల శృంగార సౌందర్యమును వర్ణించెనే కాని శ్రీనాథుఁడు, ముద్దుపళనివలె పచ్చిగా సంభోగ శృంగారమును వర్ణింప లేదే, పచ్చిగా ననుటకు? హరవిలాసమున లింగోద్భవ కథను పురాణ కథా కథన క్రమమును పాటించి శ్రీనాథుఁడు రచనను సాగించెనే కాని స్వయంకపోల వర్ణనచేయలేదు; యసభ్యమనుటకు. కాని యీ వర్ణనలను బట్టి కవియగు శ్రీనాథుని స్త్రీలోలుఁడని వాదించుట సముచితమెంత మాత్రమును గాదు. మఱియు హరవిలాసాది గ్రంథములందుఁ గొన్ని యశ్లీలపదము లుపయోగించిన మాత్రాన శ్రీనాథుని శీలము దుష్టమని యెంచుట యంతకంటెను విరసము. అవి కూడ విచారింతము హరవిలాస సప్తమా శ్వాసమున మాయాకిరాతుఁ డర్జునుఁ దిట్టుచు,

క॥ మండెదు బలునారసమున,
గుండియపగులంగ నేసి కూల్చితి దీనిన్
వెండి ప్రయోజన మేడీ,
రండాసుత! దీనిపై శరము నిగుడింపన్॥ హరవి 7-24

ఇక్కడ "రండాసుతా! "యని యర్జునిని మాయాకిరాతుఁడు సంబోధించుట, యతని కోపమును రెచ్చకొట్టుటకు మాత్రమే కాక, యది కిరాతోచిత భాషగూడ నైయున్నది. కాన నిది యశ్లీలార్థమని కాని, తన్మూలమున శ్రీనాథుని స్త్రీ లౌల్యము ద్యోతకము చేయు ననుట వట్టి వెఱ్ఱి. అట్లే కాశీఖండమున దక్షేశ్వరలింగ మాహాత్మ్య నిరూపకమైన ఘట్టమున,

సీ॥ ఏమి 'గుడువంగ' వచ్చి నారిండ్లు విడిచి, హరుని వెలి
వెట్టి నట్టి యీ యాగమునకు, బాచవదనుని కనుజేవురించె నేని, తత్
క్షణంబునఁ దమ యాంధ్ర శాస్త్రిల్లు దెగవె॥

ఇందు "కుడువంగ" అను పదప్రయోగ మశ్లీలమనియు నోటు మాటయనియు ప్రభాకరశాస్త్రిగారి వాదము. దాన శ్రీనాథుని శీలము శంకావహ మనిరి. 'కుడుచు' ధాతువును భుజించుటను నర్థమున మాత్రమే నన్నయనుండి చిన్నయవఱకు ప్రయోగింపఁబడినది. అందెక్కడను దురర్థస్ఫురణ లేదు. ఇటీవలనే యీ శబ్దమున కర్థపరిణామమున (metathesis) మార్పు వచ్చినది. భాషాశాస్త్రి ప్రవీణులైన ప్రభాకరశాస్త్రిగారికీ స్వల్పవిషయ మేలనో తెలియఁక యిట్లపోహపడిరి ఇతర ప్రయోగములు చూడుఁడు.

"గీ॥ కుడిచి కూర్చుండి రాజ్యంబు విడిచిపోయి, విభునకును
నీకు నెటువంటి వెఱపుట్టె"॥

(పిల్లలమఱ్ఱి పినవీరుని జైమిని భారతము)

వ॥ మా ఇంటికిం గుడువరమ్ము; కుడిచి కూర్చున్న పిమ్మటం గొన్ని మాటలు నీతో నాడఁగల" కాశీఖండము VII 165. అని వ్యాసునితో నన్నపూర్ణ విశాలాక్షి పలుకును. మఱియు శివరాత్రి మాహాత్మ్యమున,

సీ॥ పాండు భూపాలుండు పరలోకగతుఁడైన గుంతి చావక యేమి
కుడువ నుండె, అనియు శ్రీనాథుడు వాడినాఁడు. ఇఁక నన్నయ
ప్రయోగమిది.

ఉ॥ "వాసవనందనుండు గుడువన్" ఆది. ఆ. V

క॥ అప్పుడతఁడటులు సెప్పఁగ, "దప్పఁదలంచిన ఫలంబు తగఁ
గుడువక పోఁజొప్పడునె" అని తిక్కన వ్రాసెను. భార. శల్య. ఆ I

చ॥ నేఁగుదువఁ బిలుగాని తేపఱం గల యూరఁటి పొద్దెఱుంగఁడీ
కొడుకిటు పోకకున్ మనము గుందెడు నిన్ గనియూ అడిల్లె
డున్" విరా II :3.

పై ప్రయోగములందు లేని యశ్లీలము ప్రభాకరశాస్త్రిగారు చూపిన దానిలో నుండుట వారియుక్తివైచిత్ర్యమే కాని అన్యము కాదు. ఇది వారిసంకుచిత దృష్టిదోషమే.

మఱియు "విద్వజ్జనులు నిన్ను విషయించి వత్తురు" అనుచోట నశ్లీలము వాడినాఁడు శ్రీనాథుఁడని యాక్షేపణ. నైషధమున దమయంతీ వివాహసందర్భమునందు బువ్వపుబంతిలో జరుగు పరిహాసములు జరుగునపుడు శ్లేషతో వర్ణింపఁబడినది కాన నశ్లీలమనిగాని, దాని వలన శ్రీనాథుని శీలము దుష్టమనికాని చెప్పవలనుపడదు. ఇట్టివన్నియు శ్రీనాథునియందు రంధ్రాన్వేషణము చేయువారికి మాత్ర మట్లులోఁచును. ఇంకొకటి.

మ॥ యజమాన క్రమదా వికస్వర భగన్యస్తాశ్వదీర్ఘస్మర
ధ్వజదండంబగు నశ్వమేధ మఖతంత్రంబు న్నిరీక్షించియి
క్కుజనుం డొత్తిలి నవ్వె వేదవిదులం గుత్సించి పుష్పాస్త్రుచే
నిజహస్తంబున వేసి యశ్రుకణముల్ నిండార నేత్రంబులన్. VII133

ఈవర్ణనయందు శ్రీనాథుఁ డౌచిత్యమును పాటింపలేదని యాక్షేపణ. ఇదియశ్వమేధయాగ తంత్ర విధాన క్రమము. శాస్త్రప్రక్రియ కాన యథావిధిగా వివరింపక తప్పదు. అశ్లీలదోషమున మఖతంత్ర విధానమును పరిహరించినచో శాస్త్రవిషయమునకే మోసమువచ్చి యపభ్రంశమగును. కాన శ్రీనాథుఁడట్లు వర్ణింపక తప్పదయ్యెను. శాస్త్రవిషయ ప్రతిపాదనమున శ్రీనాథునకు దోషమంటఁగట్టుట విరసమగును.

ఇఁక శ్రీనాథుని చాటుధారపద్యములనుబట్టి యతఁడు స్త్రీలోలుఁడనుట:- ప్రభాకరశాస్త్రిగారు కొన్ని చాటువులగు శృంగారపద్యముల నుదాహరించి క్రీడాభిరామ పీఠిలో నవి శ్రీనాథ కృతములని భావించి, వానిని బట్టి యతఁడు స్త్రీలోలుఁడని నిర్ణయించియు, చివర 68-వ పుటలో నిట్లు వ్రాసిరి. "ఇందు నే నుదాహరించిన వానిలో నే వేని కొన్ని గాని, యింకను నట్లు వినవచ్చు వానిలోఁ గొన్ని గాని నిజముగా శ్రీనాథకృతములు గాకయుఁ బోవచ్చును" అని సందేహమును స్పష్టపఱచినారు. ఇందుచే శ్రీనాథుని చాటుపద్యము లవేవో, యేవికావో స్పష్టముగ నిర్ణయించుట కష్టము. రాజమహేంద్ర పండితులకు శ్రీనాథునిపై నసూయా ద్వేషములు పెఱిగినవని,

శా॥ హాంసీయావకుఁ గాంచికి న్నధరరోమాలుల్ పథః పుష్పముల్
సంసారద్రుమమూలపల్లవగుళు చ్ఛంబైన యుచ్ఛోటవి
ద్వాంసుల్ రాజమహేంద్ర పట్టణమునన్ ధర్మానం బుండి ప్ర
ధ్వంసాభావము ప్రాగభావమనుచున్ దర్కింతు రెల్లప్పుడున్

అను పద్యమువలన స్పష్టముకదా! ఈపద్యరచనకు వ్యాఖ్యానముగా ప్రభాకరశాస్త్రిగారు "తర్క విద్వాంసులు తన్నును దన విషయ లౌల్యమును నుద్దేశించి యాసడింపఁగా శ్రీనాథుడు చెప్పిన దని క్రీడాభిరామ పీఠికలో వ్రాసిరి. ఇది తనవిషయ లౌల్యము నుద్దేశించి యాసడించినపుడే చెప్పినదనుటకు ప్రమాణమేది? ఇది ప్రభాకరశాస్త్రిగారి యూహాకల్పనము మాత్రమే. అతని విద్వత్కవితా ప్రతిభలఁగూర్చి యసూయాద్వేషములఁ జూపినపుడు చెప్పెనని యేల భావింపరాదు? అటువంటిదే యీ పద్యము.

మ॥ శ్రుతిశాస్త్రస్మృతులభ్యసించుకొని విప్రుండంత నానాధ్వర
వ్రతుఁడై పోయి కనున్ బురందర పురారామ ప్రమదానల్పక

ల్పతరు ప్రాంతలతాకుడుంగ సుఖసుప్త ప్రాప్తరంభా భగ
ప్రీతిరోమాంకుర పాలనక్రమ కళాపాండిత్య శౌండీర్యమున్।

ఈ పద్యమునకుం గూడ బ్రభాకరశాస్త్రిగారు "మహావిద్వాంసుండయ్యు శ్రీనాథుండిట్టి స్త్రీలౌల్యమునం జెడ్డాండని రాజమహేంద్రవరమున సోమయాజులు నిరసింపంగా శ్రీనాథుండు చెప్పె"నని వ్యాఖ్యానించిరి. ఇది కూడం బ్రమాణరహితమైన యూహాకల్పనమే. ఇట్టి యూహాకల్పనలమీందనే ప్రభాకరశాస్త్రిగారు శ్రీనాథుని స్త్రీలౌల్యవాదమును లేవందీసిరే కాని ప్రమాణమేమియు లేదు. వీనిని బట్టి రాజమహేంద్రవర పండితు లశక్తదుర్జనులై శ్రీనాథుని విద్వత్కవితా ప్రతిభలకు, రాజమర్యాదలకు నసూయాద్వేషములను బూని, యాతనిని న్యూనతపఱచి యల్లరిచేయుటకై యసహ్యశృంగార పద్యములను గొన్నింటిని రచించి, కర్తృత్వమును శ్రీనాథుని కాపాదించి ప్రచారము చేసియుందురు. అందుపైనే శ్రీనాథునుపై రెండు పద్యముల నొడలుమండి చెప్పియుండునని నా దృఢవిశ్వాసము. ఆ పద్యములు క్రమముగా దేశమున వ్యాపించి శ్రీనాథుని పేర పారంపర్యముగా వ్యవహరింపంబడియుండును. వానిని జూచి శృంగార ప్రియులు విలాసార్థము కొన్ని పద్యములు వ్రాసి శ్రీనాథున కంట కట్టియుందురు. ఇటువంటి విషయమే తెనాలి రామకృష్ణుని హాస్యకథల ప్రచారము గూడ. హాస్యరసప్రియుండని ప్రఖ్యాతిగల తెనాలిరామకృష్ణ కవికృత కావ్యములలో హాస్యరసమే కానరాదు, మచ్చార్థమునకు. దీనికేమందురు? ఆశృంగారపద్యములు సలక్షణమైన వానిని లాక్షణికులు గొందఱు తమ లక్షణగ్రంథములలో నుదాహరించియుండవచ్చును. అప్పకవి, కూచిమంచి తిమ్మనాదులు ప్రబంధముల నుండి యుదాహరించినవని తెలిసికొనిన పద్యములు గూడం గొన్ని యా యా ప్రబంధములలోం గనంబడవే. కొన్ని తాఱుమాఱగుచున్నవే. ఇట్టి చాటు

వుల స్థితి చెప్పవలయునా ? ఒకరి చాటువు లింకొకరి పేరితోఁ గూడ వ్యవహరింపఁబడుట చూచుచున్నాము కదా. కానఁడున్న చాటువులను బట్టి శ్రీనాథుఁడు స్త్రీలోలుఁడనినిర్ణయించుట సరసముగాదని నా విశ్వాసము.

శ్రీనాథుఁడు స్త్రీ లౌల్యమును ప్రాభవ విశేషముగానే పరిగణించు సిగ్గులేనివాఁడని ప్రభాకర శాస్త్రిగారు క్రీడాభిరామ పీఠిక 72వ పుటలోనిట్లు వ్రాసిరి. "శ్రీనాథున కిఁకఁదనవలచి ప్రవర్తించిన శృంగార ప్రవర్తనమును గూర్చియా సిగ్గుపాటు! అతఁడు దాని నొక ప్రాభవ విశేషముగానే పరిగణించెను. అతఁడే కాదు అతని నాదరించిన యాచకాలపు మంత్రులు గూడ, నట్లే పరిగణించిరి. కాకున్న చో భీమఖండమునఁ "గాంచీ మాక్తిక తారహా" రిత్యాది పద్యములను రచించుట యెట్లు" భీమఖండములోని పై పద్యమున కెట్లు ప్రభాకర శాస్త్రిగారు దుర్వ్యాఖ్యానము చేసినదియు వెనుక స్పష్టపఱచినాను కదా. ఇఁక శ్రీనాథుఁడు తన స్త్రీ లౌల్యమును సిగ్గునొగ్గు లేక ప్రాభవముగానే పరిగణించిన వాఁడనుట సత్యమేయగునేని, దానిని గూడ నాశ్వాసాంతగద్యలలోఁ జేర్చుకొనెడివాఁడే కదా శ్రీనాథుని విజ్ఞానమంతగాబరిణమించినదని నే నూహింపఁజాలను.

మాడభూషి వెంకటాచార్యులుగారు 'రామావసూటి తారావళిని' రచించి తన వేశ్యాప్రియత్వమును ప్రకటించికొనిరి బాహాటముగా, నట్లే శ్రీనాథుఁడు గూడ చెప్పుకొనెనని ప్రభాకరశాస్త్రిగారి వాదము. మంచిదే. వెంకటాచార్యులువారు రచించుకొనినట్లుగా శ్రీనాథుఁడు గూడ నొక గ్రంథమును దన వేశ్యపై రచించెనని ఋజువు చేయు సప్రామాణిక మైన కృతియున్న చో నంగీకార్యమే. అట్టి ప్రమాణము లేనినాఁడు పోలికలతో ప్రయోజనమేమి. మఱియు జగన్నాథ

పండితరాయలు తన యవనీ ప్రియత్వపు ముచ్చటను జెప్పుకొని భామినీ విలాసమును రచించెననియు, కాశీపట్టణమున విద్వాంసులీ పండితరాయని బహిష్కరించిరఁట' యనియు ప్రభాకరశాస్త్రిగారు రచించిరి. సరే అట్టి మర్యాదయేదియు శ్రీనాథుని విషయములో జరుగలేదే. దానిని పట్టి నైనను నాతని స్త్రీ లౌల్యమును విశ్వసించుటకు ఆ విషయమిది వఱకే నేనుద్ఘోషించితిని కదా. అట్టి ప్రమాణము లేవియు లేకుండ శ్రీనాథుఁడు స్త్రీలోలుఁడని నమ్ముటెట్లు.

క్రీడాభిరామ రచన :-క్రీడాభిరామమును వినుకొండ వల్లభామాత్యులే వ్రాసెను గాని శ్రీనాథుఁడు వ్రాయలేదని కృత్యవతరణిక, కృత్యంత గద్యపద్యములనుబట్టి నిర్ణయింపఁబడినది. కాని శ్రీనాథుని 'వీథినాటకము' అను పేర వెలయు శృంగారపద్యములు కొన్ని క్రీడాభిరామమున నుండుటయు, శ్రీనాథుని శాలివాహన సప్తశతి యనువాదములోని పద్యములొకటి రెండు దీనియందుండుట చేతను, శ్రీనాథుని చాటు పద్యములను, గ్రంథస్థపద్యములను బోలినవి కొన్నియు నుండుట చేతను క్రీడాభిరామము శ్రీనాథరచితమే యని ప్రభాకరశాస్త్రిగారి వాదము మఱియు. దాని రచనను బట్టి శ్రీనాథుఁడు స్త్రీ లోలుఁడని వారి నిర్ణయము. క్రీడాభిరామమందలి కృత్యవతరణికయుఁ గొన్ని పద్యములను మాత్రము శ్రీనాథునివనియు మిగిలిన దంతయు వినుకొండ వల్లభామాత్యుని రచనయేయనియు, కీర్తిలోభముచే వల్లభామాత్యుఁడు శ్రీనాథునకుఁ గొంత ధనమిచ్చి యాతని సాయము పొందెననియు, వల్లభరాయని సాయమున విజయనగర సామ్రాజ్య సభాప్రవేశము శ్రీనాథునకు జరుగవలయును గాన నతఁడందుల కంగీకరించి కొంత గ్రంథ రచన గావించెనని విశ్వసింప వచ్చును.

క్రీడాభిరామ మానాటి యాంధ్రుల సాంఘిక జీవనమును బ్రతిపాదించిన యొక విశిష్ట కావ్యము. ఇందు నాఁటియుత్సవ వినోదములు, రసిక జనుల వ్యాపారములు, వివిధ జాతి స్త్రీ పురుషుల భాషా చేష్టలు మొదలైన యనేక విషయములు వర్ణింపఁబడినవి. దీనిలో శృంగార రసభావములు విశేషముగ నున్న మాట నిజము. శ్రీనాథుఁడు స్త్రీ లోలుఁడని వాదించువారు క్రీడాభిరామమునంతయు నతఁడే వ్రాసెననియు, సర్వవిధములైన శృంగార చాటుపద్యములను గూడ నతఁడే రచించెనని భావింతురు.

యథార్థమునకు, సంస్కృత సారస్వతమున కాళిదాసువలె నాంధ్ర వాఙ్మయమున శ్రీనాథుఁడు సౌందర్యాభిమాని. శృంగారరసోపాసకుఁడు. కాన ప్రపంచమున స్త్రీ సౌందర్యమేయేవిధమును నెట్లెట్లుండెనో నిశితదృష్టితోఁ బరిశీలించి, తనరచనలలో రసవంతముగ వర్ణింపఁగల్గెను. ఇట్టి వర్తనలలోఁ దన కవితాచమత్కారమంతయు బ్రకటించెను. స్త్రీ సౌందర్య వర్ణనమున కచకుచాదులను నైపుణ్యముతోఁ జిత్రించుటలో నెంతగా దూరముగాఁ బోయెననఁగా జగన్మాతయైన పార్వతీదేవిని వర్ణించుటయందుఁ గూడ శృంగారదృష్టిని మార్చుకొనలేక పోయెను. ఇట్టిచో నిఁక సామాన్య స్త్రీల వర్ణనయందు వెనుకముందు లాడునా శ్రీనాథుఁడు. ఇందుచే నితని శృంగారాభిమానమును స్త్రీ లౌల్యముగాఁ గొందఱు భ్రాంతిచెందుట కవకాశము గల్గించినది. ఇది యనివార్యమైనది. ఇంతేకాని యథార్థమున కతఁడు స్త్రీలోలుఁడు గాఁడని వెనుకఁ జేసిన విచారణవలన స్పష్టమగును. మఱియుఁ గాళిదాసెటువంటి పరమ శివభక్తుఁడో శ్రీనాథుఁడు గూడ నట్టి పరమ శివభక్తుఁడే. ఒక్క వ్యక్తిలో నీ రెండు విరుద్ధగుణములుండఁగల్గుట దుర్లభమే కాని, మహానుభావులలో నవి మిళితమగుట యసంభావ్యము

గాదు. సామాన్యలోకము నమ్మలేకపోవచ్చును. సంస్కృతమున గీత గోవిందమును వ్రాసిన జయదేవుఁడును, తెలుఁగున మొదట గోపాల పదములు రచించిన క్షేత్రయయు రాధాకృష్ణుల శృంగార రసానుభవ పూర్వకమైన భక్తిని ప్రతిపాదింపలేదా. అంత మాత్రమున జయదేవ క్షేత్రయలు స్త్రీలోలురని యెంచఁదగునా ? అట్లే శ్రీనాథుఁడు గూడ. జయదేవక్షేత్రయలలో శృంగారరస వైష్ణవభక్తులు మిళితములై పోయినవి. శ్రీనాథ కాళిదాసులలోఁ బ్రత్యేకముగ భాసిల్లినవి. ఇంతయే భేదము. ఇట్టి పరిస్థితిలోఁ గేవలము శృంగార రసైకదృష్టితోఁ జూచు వారికి శ్రీనాథుఁడు దోషిగా గోచరించినచో నది వారి దృష్టిదోష మగును గాని శ్రీనాథుని దోషమెట్లగును ? వర్ణిత విషయము లన్నియు స్వానుభవములే యని భావించినచో నిఁక నవి యన్నియు కవి జీవిత చరిత్ర క్రిందకే వచ్చును. తన భావనాశక్తి కల్పనాశక్తి లేదని యెంచవలెను. అట్లే వర్ణింపని విషయముతోఁ దన జీవితమున కెన్నఁడును సంబంధము లేదని గూడ నూహింపవలయునా ? ఇట్టి విషయములలో జాగ్రత్తగా విమర్శింపవలయును.

శ్రీనాథునిలోఁ గల శృంగార రసాభిమానమును శివభక్త్యభిమానమును సమన్వయించుకొనలేక ప్రభాకరశాస్త్రిగారు ఏకదేశముసే చూడఁగల్గిరి. అందుచేఁ గొందఱాయన వాదమును తిరస్కరించిరి. అంత వారు నిష్ఠురముగ క్రీడాభిరామ పీఠిక 78 వ పుటలోఁ దమ శృంగార శ్రీనాథముపయి విమర్శము వెలయించిన శ్రీ బండారు తమ్మయ్యగారి నుద్దేశించి "శ్రీనాథుని గ్రంథములను, శాసనములను, నైతిహ్యములను నితర సాధనములను బట్టి తత్స్వరూపస్వభావాదులు గొంతవఱకనుమేయములయ్యెను. పై విమర్శకులు శ్రీనాథుని నిష్కళంక మూర్తిని జూచినారఁట. కాని వాస్తవముగా నేనట్టి దానిఁ

జూడలేకపోయితిని. లోకసామాన్యుఁడనయిన నేను నేఁటికేనూతేండ్లకుఁ బూర్వమున్న శ్రీనాథుని మూర్తి నెట్లు చూడఁగలను? అదివ్య దృష్టి నాకు లేదు. నేను లోకోత్తరుఁడను గాను" అని వ్రాసిరి. ప్రభాకర శాస్త్రిగారికిగోచరించిన శ్రీనాథుని మూర్తిని మనముగను గొనినాము కద. ఇఁక నా దృష్టికి శ్రీనాథుఁడెట్లు గోచరించినాఁడో క్రింద మనవి చేయుదు, నాతని రచనలలో ప్రతి ఫలించిన రీతిని బట్టి.

శ్రీనాథునిమూర్తి ద్విముఖములతో నొప్పినదని ముందు తెల్పి నాను. ఒకటి యిహలోక ముఖము రెండవది యాధ్యాత్మిక ముఖము. ఆతని వైహిక ముఖము నితరు లనేకులు గమనించినదే. ఇది యిహ లోక సంబంధమైనది. స్త్రీ సౌందర్యాభిమానము దీనిలోఁ జేరినదే. మఱియు నితఁడు రాజభోగముల నాశించి యనుభవించినాఁడని.

సీ॥ కాశికా విశ్వేశుఁ గలిసె వీరారెడ్డి,
రత్నాంబరంబులే రాయఁడిచ్చుఁ
గైలాసగిరి బంట మైలారు విభుఁడుండె,
దినవెచ్చ మేరాజు దీర్చఁ గలఁడు
రంభగూడెఁ దెనుంగురాయరాహుత్తుండు,
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁడయ్యె విస్సనమంత్రి మఱిహేమ,
పాత్రాన్న మెవ్వని పంక్తిఁ గలదు

గీ॥ భాస్కరుఁడు మున్నె దేవుని పాలికరిగెఁ
గలియుగంబున నిఁకనుండఁగష్టమనుచు
దివిజ కవివరు గుండియల్ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁడమరపురికి.

అను పద్యమువలన స్పష్టమగుచున్నది. కాని విధి చాల నప్పుడు సకల నికృష్టతమములనుగూడ ననుభవించి బాధపడినాఁడని.

శా॥ కుల్లాయుంచితిఁ గోకచుట్టితి, మహాకూర్పాసమున్ దొడ్గితిన్
వెల్లుల్లిన్ దిలపిష్టమున్ మెసవితిన్, విశ్వస్త వడ్డింపఁగా
జల్లా యంబలిఁ ద్రావితిన్, రుచులు దోసంబంచుఁ బోనాడితిన్
దల్లీ ! కన్నడరాజ్యలక్ష్మి ! దయలేదా నేను శ్రీనాథుఁడన్

ఉ॥ దోసెఁడు కొంపలోఁ బసుల తొక్కిడి, మంచము దూడ రేణమున్
బాసినవంటకంబు, పసిబాలుర శౌచము, విస్తరాకులున్
మాసినగుడ్డలుం దలకు మాసిన ముండలు వంటకుండలున్
రాసెఁడు కట్టెలుం దలఁపరాదు పురోహితులింటి కృత్యముల్

అను పద్యముల వలను విశదమగుచున్నది. ఇట్టి రోఁత గలిగించు విషయము లతఁ డసహ్యించుకొనినాఁడు గతిలేక యనుభవించినాఁడు. పోతనవలె నితఁడు విరాగికాఁడు. ప్రాపంచిక సుఖము లనుభవించుటయందు పోతన సాత్వికుఁడు; శ్రీనాథుఁడు రజోగుణము ప్రధానముగా గలవాఁడు. మఱియు శ్రీనాథుఁడుబహు సుకుమార హృదయుఁడైన నాగరికుఁడు.

క॥ రసికుడు పోవఁడు పల్నా డెసగంగా రంభయైన నేకులె వడుకున్
వసుధేశుఁడైన దున్నును, గుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్॥

గీ॥ చిన్న చిన్న రాళ్ళు చిల్లర దేవళ్లు, నాగులేటి నీళ్ళు నాపరాళ్ళు
సజ్జ జొన్న కూళ్ళు సర్పంబులును దేళ్ళు, పల్లెనాటిసీమ పల్లెటూళ్లు.

అని యసహ్యించుకొని నాఁడు శ్రీనాథుఁడు.

మహారాజభోగము లనుభవించిన శ్రీనాథుఁడు పరమదరిద్రములనుగూడఁ జవిచూచినట్లే, ఐహికసుఖముల నాశించిన యా శ్రీనాథుని చిత్తము పారమార్థిక విషయములందుఁ సమానముగ లగ్నమైయున్నది, శ్రీనాథుని మూర్తిలోని ద్వితీయముఖము. శ్రీ

నాథుని యీముఖమును జూచుటలోఁ బ్రభాకరశాస్త్రి ప్రముఖులు గొంతయశ్రద్ధఁజూపిరి. ఇందుచే వారిదృష్టినుండి యది జారిపోయినది. ఆధ్యాత్మికదృష్టిలో శ్రీనాథుఁడు పోతనకుఁ దీసిపోఁడని యాతని రచనలను బట్టియే తేలఁగలదు. కాని విమర్శకు లాతని గ్రంథములను లోఁతుగ, జాగ్రత్తగ సహృదయతతోఁ జూచినఁగాని యదిగోచరిం పదు. పోతన యెట్టిపరమ రామభక్తుఁడో, శ్రీనాథుఁడట్టి పరమ శివ భక్తుఁడు గురజాడ శ్రీరామమూర్తి గారు తమ కవిజీవితములలోఁ దిక్కననుగూర్చి వ్రాయుచు శ్రీనాథుఁడు వైదికాచార దూరుఁడని యజ్ఞానముతో నిటురచించిరి. "వేదవేదాంతార్థములు కేవలము తెలిసి నను దదుక్తకర్మాచరణములేని వారల కట్టిపట్లు తెలిఁగింప సమర్థత యుండదని, శ్రీనాథుఁడు తానట్టివాఁడు కాకుండుటంబట్టి యూహించి యుండును. శ్రీనాథుఁడేకాక యాతని తండ్రియుఁ దాతయుగూడ వైదిక సంపత్తిలేనివారే... కావునఁ బైవిషయములలో శ్రీనాథుఁడు తనకంటెను భారతామ్నాయమును దెనిగించుటకుఁదిక్కన యొక్కఁడే లౌక్యవైదికములు రెండింటను సమర్థుఁడని యోచి యారీతిగా వర్ణిం చెను" ఇది యవిచారమూలకమగు వ్రాఁత. శ్రీరామమూర్తిగారి వాక్యములను ఖండించుచు శృంగార శ్రీనాథమున 308 పుటలో ప్రభా కరశాస్త్రిగారే యిట్లువ్రాసిరి. శ్రీనాఁథుఁడు వైదికదూరుఁ డనుటకుఁ దగిన యాధారములేదు. అతని తాతతండ్రులను గూర్చి మన కేమియు నెఱుఁగరాదు. నిరాధారముగ శ్రీరామమూర్తిగారు నెలకొల్పిన పై విషయము మనకు నిరాకరింపఁదగినది. శ్రీనాథుఁడు వేదాదివిద్యా సంపన్నుఁడనుట కనేకాధారము లున్నవి. హరవిలాసమున—"పరమ పుణ్యా", "కులపవిత్ర", "అఖలపురాణవిద్యా ప్రవీణ" "అధ్వర్యు వేదశాఖాధీతినిష్ణాతు" 8-I, "ఆగమజ్ఞాననిధివి తత్త్వార్థఖనివి, బహు

పురాణజ్ఞుఁడవు శుభభవ్య మతివి'' I-12, (అని తిప్పయసెట్టి శ్రీనాథుని సంబోధించి నట్లున్నవి. నైషధమున,

శా॥ బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడ వుదగ్రప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చన కళాశీలుండ వభ్యర్హిత
బ్రహ్మాండాది పురాణ చయతాత్పర్యార్థ నిర్ధారిత
బ్రహ్మజ్ఞాన కళానిధానమవు నీభాగ్యంబు సామాన్యమే॥ I-13.

(అని చిన్నతనముననే మామిడి పింగనామాత్యునిచేఁ బొగడ్త చెందిన వాఁడు గాని సామాన్యుఁడుగాఁడు). కాశీఖండమం దీతని వైదికవిద్యా సంపత్తిం దెలుపు భాగము లనేకములున్నవి. పంచబ్రహ్మషడంగమంత్రములతోఁ బ్రాసాదపంచాక్షరినీతఁడుబహువారములుస్మరించినాఁడు. శ్రీనాథుఁ డుపనిషద్వాక్యములు పెక్కులు కాశీఖండమం దుదాహరించినాఁడు. శబ్దశాస్త్రముల స్ఫోటాదివాదముల నెఱిఁగినవాఁడు. పాతంజల యోగదర్శన మందీతనికిఁ బరినిష్ఠ హెచ్చు. శివపారమ్యమం దాదర మెక్కువ. కాని విష్ణుద్వేషముగల వీరశైవులతోడివాఁడీతఁడు గాఁడు. ఒకరీతఁడు లింగధారి నియోగి బ్రాహ్మణుఁడని తలంచిరి. నాకది యంగీకారార్హముగాఁదోఁపదు. లింగధారులకు విష్ణుద్వేషము విహితము. ఈతని కదిలేదు. అద్వైతమందే యాస్థ కానవచ్చును. బహుభేదములలోఁ బరస్పరద్వేషములతోనుండు తాంత్రిక మతము లందీతనికిఁ దత్పరతయున్నట్టుతోఁపదు. "బహుధా విప్రతిపత్తి ధీవిషయముల్ పాటైనశాస్త్రార్థముల్ —." "బ్రహ్మాండాది మహాపురాణ చయతాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞానకళా నిధానమవు'' అనుపలుకు లీభావమును బలపఱుచుచున్నవి.'' వీనినిబట్టి శ్రీనాథుఁడు వైదికాచారపరాయణుఁడనియు, వేదాంత విద్యావిజ్ఞానియనియు, బ్రహ్మజ్ఞానియనియు విదితమైనపుడాయనయాధ్యాత్మికమూర్తి స్పష్టమగుచున్నది.

కదా ! కర్మజ్ఞానయోగములకుఁ దోడు శ్రీనాథుని భక్తిప్రపత్తు లతని భీమఖండమున ద్యోతకమగుచున్నవి. పోతనగారి భక్తిభావములు భాగవతమందలి ప్రహ్లాద, కుచేల' మైత్రేయాది భక్తులమూలమున ప్రతిపాదింపఁబడినట్లుగా, శ్రీనాథుని యీశ్వరభక్తి ప్రకటన మూలమున ప్రదర్శింపఁబడినది. పోతన ప్రహ్లాదాది భక్తులతో నైక్యమైపోయి దనభక్తిభావములను ప్రదర్శించినట్లుగా, శ్రీనాథుఁడు వేదవ్యాస బ్రహ్మాదరి సప్తఋషులతో నైక్యముచెంది, తన్మయుఁడయి తన యీశ్వరభక్తిని ప్రదర్శించినాఁడు. ఇట్లు ప్రదర్శించుటలోఁ పోతనకుఁగూడ శ్రీనాథుఁడు మార్గదర్శకుఁడైనాఁడు తిలకింపుడు.

శ్రీనాథుఁడు దన యుపాసనాధి దైవంబగు శ్రీమహేశ్వరునిఁ దనమనమం దీక్రిందివిధముగాఁ జిత్రించుకొని భక్తులకు సాక్షాత్కరింపఁ జేసినాఁడు దనకావ్యములందు. అది పురాణములందు వర్ణింపఁబడినదే కావచ్చును.

సీ॥ భోగీంద్రభూషణు భూతిదిగ్ధాంగుని, నాభీల శూలాయుధాగ్రహస్తు
గాకోల విషనీలకంధరాభాగుని, గజచర్మపరిధాన కటివిభాగుఁ
దాండ వాడంబరోద్దండ దివ్యాకారు, నబ్జవిష్ణు విబుధాధిపాభివంద్యు
గంగాతరంగ సంకలితోత్తమాంగుని, త్రైలోక్య రక్షాప్రధానదక్షు,
గీ॥ నీశు సాకారునొండె నొండే విభూతి,
పతి నిరాకారుఁగాఁ జూచి బహువిధములఁ
బూజసేయంగ నేర్చిన పుణ్యమతులు,
వారు శివభక్తులందు రివ్వసుధలోన॥ భీమ 1-V45

ఈరూపమునే లక్ష్మ్యాదులకు సాక్షాత్కరింపఁజేసినాఁడు శ్రీనాథుఁడు. వారు శివునకేకరీతులఁ బూజించి ప్రస్తుతించినవిూఁదట,

చ॥ వికట జటాకుడుంగమున వెన్నెలతేని ధరించి, పీనులం
బ్రకటిత నాగకుండల భరంబులువ్రేలఁగ నుపరిసన్నుఁడై

వికవికనవ్వుచుం గరము వేడుకతోఁ జూడఁజూపె భీమనా
యకుఁడు మహాపతివ్రతల కంబికతోఁ గరుణాగుణంబునన్.

భీమ. 5. 54

ఈ యాకారమే సిరాలుతండ్రికి శివుఁడు ప్రత్యక్షమైనపుడుగూడ శ్రీనాథుఁడొసఁగినాఁడు.

శా. రక్తాపాండురమైన దేహము నహిగ్రైవేయముం గంధరా
కుక్షింగప్పును బ్రిస్ఫురద్ఘన జటాకోటిన్ శశాంకార్ధముం
జక్షుః పద్మముతోడి ఫాలతలమున్ సంధిల్ల శంభుండు ప్ర
త్యక్షుండయ్యె సిరాలుతండ్రికి హృదాహ్లాదంబు సంధిల్లఁగన్.

హర. (3) 135.

మరల నాస్వరూపమునే కిరాతార్జునీయమున నర్జునునకు శివుఁడు సాక్షాత్కరించినపుడుగూడ శ్రీనాథుఁడొసఁగును.

శా. అంతం జంద్రికళాధరుండు నిజబాహాగాఢ పీడా పరి
శ్రాంతుండై యట పాండుసూతియెదురం బ్రత్యక్షమయ్యెం గృపా
వంతుండై యహిరాజహారములతో స్వర్వాహినీవేణితో
దంతిత్వక్పరిధాన పల్లవముతోఁ దామ్రజ్జటాపంక్తితోన్॥

హర VII-89

ఈమహాశివుని శ్రీనాథుఁడు పరమాత్మగాను, పరబ్రహ్మ స్వరూపముగను, వేదాతీతునిగను, వేదాంతోపనిష ద్రహస్యమును గా నిట్లు భావించి యిట్లు,

శా. వేదాతీతుని వేదవేద్యుని శివున్ వేదాంవేద్యున్ భవున్,
వేదాంతోపనిషద్రహస్యముఁ జతుర్వేదీ విహారాలయున్,
వేదాంగాది పురాణ ముఖ్యవిలస ద్విద్యాగమ ప్రక్రియా.
వేన్నివిన్ను భజింతు నెమ్మనమునన్ విశ్వేశభీమేశ్వరా॥భీమ V-136

అని సప్తమునుల ముఖములనుండి స్తోత్రము చేయించినాడు. శ్రీనాథుఁడు. ఇట్టి పరమేశ్వరుని స్మరణచేయు సందర్భము వచ్చినపు డతనిని వివిధనామములతో, వివిధరూపములతో, వివిధవర్ణనలతో నోరారఁగ నుచ్చరించినఁ గాని శ్రీనాథునకు సంతృప్తియుండెడిదికాదు. అందుచేత నేదొక్కనామమో, యేయొక్క నామముతోడనో శివుని సంబోధించుట యపచారమని గూడ భావించినాఁడేమో శ్రీనాథుఁడు. చూడుఁడు శ్రీనాథుని జిహ్వాచాపల్యము బహువిధ శివనామస్మరణ యందు.

తే॥ శర్వసర్వేశ్వ రీశ్వరు సర్వవంద్యు. శర్వసర్వప్రదాయకు సర్వదాత,
శర్వసర్వంసహామహీ చక్రధరుని, శర్వవర్ణింతు దేవతాసార్వభౌము
భీమ V 135

అని సప్త మునులచేత స్తోత్రము చేయించినాఁడు. ఇఁక లక్ష్మా దుల చే స్తుతింపఁజేసినపుడు గూడ, "భీమేశ్వర, భీమనాథ, భీమశంకర, భీమలింగ, మహాదివ్యలింగ యవాఙ్మానసగోచర,......నిర్గుణుండవు, గుణాతీతుండవు, గుణాఢ్యుండవు .....సంసారి వసంసారివి, భవుండ వభవుండవు, మంగళుండ వమంగళుండవు, భుజంగ భూషణా" భీమ V 53) అని యిట్లు వివిధరూపములఁ బేర్కొనును. మఱియు బ్రహ్మ విష్ణ్వాదులచేఁ గూడ నిట్లు పొగడించినాఁడు శ్రీనాథుఁడు.

క॥ సర్వేశ్వర ! సర్వాత్మక ! శర్వ ! సదాశివ ! మహేశ ! శాశ్వత !
రుద్రా ! సర్వజ్ఞ ! భీమనాయక !, గర్వాంధుల వణపుత్రి
పురకర్బురపతులన్. భీమ IV 117

ఇఁక దేవతలచే శివనామస్మరణ నిట్లు సేయించినాఁడు కవి.

తే॥ దేవదేవ మహాదేవ దివిజవంద్య, సర్వలోకైకరక్షణ చతురశర్వ,
హాలహాల కూట సంపర్క నీలకంఠ, మ్రొక్కెదము దేవికిని
నీకు ముదముతోడ. భీమ IV 73.

వ॥ దేవదేవ, మహాదేవ, సదాశివ, యీశ, యీశాన, తత్పురుష యఘోర, సద్యోజాత, వామదేవాఖ్యాన పంచవదన, మూర్తి విశేష, ప్రకృతి ప్రధాన కారణ,మీకు సాష్టాంగ నమస్కారంబు భీమ IV 85.

క॥ నీ మహిమార్ణవమునకును, సీమాంతము గలదె రాజశేఖర దక్షా రామపురధామ శంకర. భీమేశ్వర నీలకంఠ పేశలకరుణాభీమ.IV86

పిమ్మట వ్యాసునిచే నెట్లు నామస్మరణ చేయించెనో శ్రీనాథుఁడు చూడుండు.

తే॥ భీమ భీమేశ్వరేశ్వర, భీమనాథ!. దక్షవాటిపురాధ్యక్షదర్పకారి, సప్తగోదావరోత్సంగ, జమమహేశ, నన్ను రక్షింపుమనుచు విన్నపము సేయు. భీమ III 192.

ఇట్లు శ్రీనాథుఁడెట్టి యవకాశము దొరకినను, నే సందర్భము కలిగినను, నోటితుప్పు వదలిపోవునట్లుగా శివుని వివిధనామములనో, మూయన గుణవిశేషములనో, మూయన మాహాత్మ్య సూచకములనో, వివిధ పాత్రములచేత పారాయణచేయించునే కాని లఘువుగ వదలి పెట్టఁడు.

భక్తి నవవిధములుఁగ ప్రతిపాదింపఁ బడునని భాగవతమున నిట్లు వివరింపఁబడినది.

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనం

అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనం" (భాగవత VII 23) ఈ తొమ్మిది విధములలోను పై హరనామ సంబోధనము సంకీర్తన స్మరణములకుఁ జెందవచ్చును. మఱియొకవిశేష మేమనఁగా శ్రీనాథుడు హరసంకీర్తనము చేయునపుడు సర్వసామాన్యముగా "భవారణ్యపావక") భీమ V 134) అనియు, "భవాబ్ధితారణా" (భీమIV 1:2) అనియు, "భవరోగభంజను" (భీమ III 83) అనియు, "సంసా

రాబ్ధి తరణ ఘనతర చరణాంబురుహ ప్లవ'' (భీమ VI 87) అనియు సంస్తుతింపఁ జేయువాఁడు తన కావ్యపాత్రములచే. ఇది తన స్వంత పార్థనయై యుండును. మూలములో లేని దానిని కూడ వ్రాయుచు శ్రీనాథుకు తన శివభక్తి విశేషము చేత మూలవిషయములను ప్రపంచించి విస్తారముగ వర్ణించినాడు. ఐహిక సుఖముల నెంతగా ననుభవించి, యభిమానించినను, వానితోపాటు సంసారకష్టములను గూడఁ బూర్తిగ ననుభవించినవాఁడు కనుకనే వేదాంతివలె భవబంధ మోక్షమును గోరినాఁడు. శ్రీనాథుఁడు సంసారాజ్ఞానములోఁ బడలేదు. జ్ఞానముతోడనే మెలఁగినాడు.

శ్రీనాథుఁడు తాను "ఈశ్వరార్చన కళాశీలుండ''నని చెప్పుకొనుటయే కాక తన పాత్రములకు భక్తులచేఁ గూడ నీశ్వరార్చన మొనర్పఁజేసినాఁడు. చూడుఁడు.

కం॥ సిరివాణి గౌరిసతియ, ప్పరసలరుంధతి యహల్యశచి మొదలగు స
త్పరమ పతివ్రత లర్చిం, చిరి దక్షారామునిలయు శ్రీభీమేశున్
(భీమ V 52)

తర్వాత నొకప్పుడు పాడవగు స్తుతి పూర్వక కీర్తనమును గావించిరి. (భీమ V 53) మఱియు సప్తమహర్షుల చేతఁ గూడ శివుని నర్చింపఁజేసినాఁడు కవి. చూడుఁడు "అనంతరంబు సప్తర్షులు గంగా జల సప్తగోదావరీ జలంబుల నభిషేకించి పూజించి భీమలింగంబు నిట్లని ప్రత్యేకంబు స్తుతించిరి'' (భీమ V 125) తర్వాత 15 పద్యములలో సప్తర్షులు శివుని కీర్తించిరి. ఇఁక వ్యాసుల వారిట్లు శివార్చన చేసిరఁట

తే॥ తుల్య గోదావరీనదీ తోయనిధిని, సప్తగోదావరంబున స్నానమాడి
యాచరించు శివార్చనం బనుదినంబు, దక్షవాటిక నుండి సత్యవతి
సుతుడు. భీమ III 190.

శివార్చనసైన తరువాత వ్యాసుఁడీశ్వరుని గీర్తించును 2౦ పద్యములతో. అందు 2 పుటల పొడవు గల వచన మొకటి శివుని మాహాత్మ్య వర్ణనపూరితమును భక్తిపూరితమునై యున్నది. ఇందు శ్రీనాథుడు దన శివభక్తి భావములను మిళితము చేసి యాత్మీయ హృదయ నిర్వేదముల వెల్లడించినాఁడు.

పిమ్మట శ్రీనాథుఁడు దాస్యభావమున శివుని శరణు వేడును. కావ్యపాత్రలగు సప్తముని, దేవతానికర, వ్యాసాదుల ముఖరూపమున సప్తర్షులిట్లు శివుని శరణు వేఁడిరి.

సీ॥ దుగ్ధాబ్ధిమంథనోద్భూత హాలాహల,
జ్వలన మేచక కంఠ ! శరణు శరణు,
గిరిచాప నిష్ఠ్యూత హారి శిలీముఖదగ్ధ,
పురగోపురాట్టాల ! శరణు శరణు,
సింధురాంధ జలంధరాంధక వ్యాఘ్రాది,
సురకంటక ధ్వంస ! శరణు శరణు
విలయ సంధ్యాకాల వికట తాండవకేళి,
జర్జర బ్రహ్మాండ ! శరణు, శరణు,
గీ॥ శరణు ఖేచర దేవతా సార్వభౌమ ! శరణు త్రైలోక్య సతత రక్షాధురీణ !, శరణు దక్షిణకాశికా స్థాననిలయ ! శరణు భీమేశ శంకర ! శరణు శరణు.
భీమ VI 46.

ఈ శరణాగతివర్ణన శ్రీనాథుని హృదయము పట్టియిచ్చుచున్న దని నాభావము. ఇది సప్తమునీశ్వరుల మూలముననే యతఁడు పలికింపవచ్చుఁ గాక. ఇవి యతని సహజ కవితాశైలిలో, శివమాహాత్మ్య పూర్వక ఘనకార్య నిర్వహణ సూచకములై, లోకరక్షణార్థమై శివుఁ డొనర్చిన మహాకార్యములను వర్ణించుచు, నందుల కాయనపైఁ గల భక్తిభావములను, గృతజ్ఞతా పూర్వకముగ వ్యక్తీకరించునవియై

యున్నవి. ఇది శ్రీనాథుని హృదయాంతరాళము నుండి వచ్చిన భావావేశము గాని, శుష్క- వాక్యములు శూన్యహ_స్తముల వంటివి కావు. ఇట్లే దేవతల ముఖమునఁ గూడ నీశ్వరు శరణు వేఁడుచున్నాఁడు శ్రీనాథుఁడు.

క॥ శరణము భజింతు మథవుః, శరణము భజియింతు మర్ధచంద్రా
భరణుని, శరణము భజింతు మీాశుని, శరణము భజియింతు మద్రిజా
వల్లభునిన్. భీమ IV 81.

ఇఁక లక్ష్మ్యాదులు శివునకుఁ గావించిన నమస్కార విధానము శ్రీనాథుని హృదయపుటము నుండి బయలు దేఱినదే. అది యిది. తిలకింపుఁడు.

"నీదేవికి నమస్కారంబు, నీకు దండప్రమాణంబు, కటాక్షింపుమని ప్రార్థించిరి. తదనంతరంబయో సర్వమంగళా! భువనేశ్వరీ! సర్వమంగళదాయినీ నీకు మ్రొక్కెదము మమ్ము రక్షింపుమని మహాదేవికిం గేలుదోయి నొసలిపయిఁ గీలించి, యోమహాదేవ! మహానుభావ, శశాంక శేఖర నమస్తే, నమస్తే, నమః.

అని యనేక ప్రకారంబుల స్తుతించిన. భీమ V 53.

దేవతల చేత నీశ్వరున కీవిధముగ సాష్టాంగముగ నమస్కరింపఁ జేసినాఁడు శ్రీనాథకవి.

వ॥ దేవదేవ, మహాదేవ, సదాశివ, యీాశ, యీాశాన, తత్పురుష, యఘోర, సద్యోజాత, వామదేవాఖ్యాన, పంచవదన మూ_ర్తి విశేష, ప్రకృతి ప్రధానకారణ! మీాకు సాష్టాంగ నమస్కారంబు" — భీమ II 85.

వ్యాసునిచే నిట్లు మ్రొక్కించి నమస్కరించినాఁడు శ్రీనాథకవి లయగ్రాహి:-నేమమున మ్రొక్కెముద-హేమగిరి చాపునకు-సామజ జలంధరము ఖామర విరోధి గ్రామ మదహారి కభి-రామశుభ నిర్మల

సుధామయ శరీరునకుఁ గామిత వితీర్ణ శ్రీమహిమశాలికి జరామరణ దోషపరిశామక నిజాంఘ్రియుగళీద్యుతికి దక్షారామపురధామునకుఁ గోమల జటామకుట-ధామహిమధామునకు భీమునకు భక్తిన్
భీమ III 204.

మఱియు "ముక్కంటీ! నీకు మ్రొక్కెదను. శివా! నీకు నవాంజలి; భవా! నీకు నభివాదనంబు; పాండురాంగా! నీకు దండంబు; రాజశేఖరా! నీకు జేజే; హరా! నీకు జోహారు;... ...యీశానా; నీకు దాస్యంబు; త్రిపురహరా! నీ కుపాసన; మృడా! నీకు శరణు! మృత్యుంజయా! నీకుఁ బ్రపత్తి; ప్రమథాధిపా! నీకు నారాధనంబు; పినాకీ! నీకు నమస్కారంబు" . ... భీమ III 212.

సప్తర్షులు శివునకాచరించిన నమస్కారవిధాన మిట్టిది.

వ॥ అద్దక్షవాటికాధ్యక్షునిసాక్షాత్కారంబువీక్షించిపరమర్షులు హర్షోత్కర్షంబునొంది, యందంద దండప్రణామంబు లాచరించి, హస్తారవిందంబులు మొగిడ్చి యిట్లనిరి.

గీ॥ ఓసదాశివ! యోదేవ యో మహాత్మ! యోవిరూపాక్ష! యో
మహాదేవ, యభవ, వరము గృపసేయుమీ దక్షవాటమునకు,
మ్రొక్కెదము మేము మీపదాంభోజములకు . భీమ VI 7+8

ఇట్లు దనకావ్య పాత్రములచే మ్రొక్కించి శివునకు శ్రీనాథుఁ డాత్మ నివేదనమును గూడఁ గావించుచున్నాఁడు. మహర్షులు దమ్ము రక్షింపుమని శివుని వేడుకొనుచున్నారిట్లు.

కం॥ హర సర్గస్థితి నాశన, కర! సంసారాబ్ధి తరణ ఘనతర చరణాం
బురుహప్లవ! రక్షింపుము, శరణాగతులైన మమ్ముఁ జంద్రాభరణా!

కం॥ అపరాధశతము లోఁ గొను, మపరిమిత కృపావిధేయ యార్త
శరణ్యా! త్రపుసీ కుసుమాభరణా!, కపర్ద కోటీవిటంకఘటిత
శశాంకా॥ భీమ VI 47+48.

ఇఁక దేవత లీరీతిగ శివుని రక్షింపుమని ప్రార్థించుచున్నారు.

సీ॥ శ్రీభీమనాయకా శివమమ్ము రక్షింపు, విశ్వైకనాథ దేవియును నీవు
శ్రీనీలకంధరా శేషాహి భూషణ, మమ్ము రక్షింపు మమ్మయును నీవు
రక్షింపుమమ్ము శ్రీదక్షవాటీశ్వరా, వేదాంత వేద్య దేవియును నీవు
దక్షిణాంబుధి తటీధామ నిర్జితకామ, మమ్ము రక్షింపు మమ్మయును నీవు

తే॥ వేడ్క రక్షింపు దేవ దేవియును నీవు, ప్రతిభ రక్షింపు గిరిశ యం
బయును నీవు, దుగ్ధపాథోధిభవ వినిర్ధూమధామ, కాలకూటాగ్ని
సంహారకారి యభవ!

కం॥ శరణము భజింతు మభవుని, శరణము భజియింతు మర్ధచంద్రా
భరణుఁ, శరణము భజింతు మీశుని, శరణము భజియింతు మద్రి
జావల్లభునిన్. భీమ IV 80, 81.

ఈ విధముగనే వేదవ్యాసుని చేతఁ గూడ రక్షింపుమని కావు
మని శివుని ప్రార్థింపఁజేసినాఁడు శ్రీనాథకవి.

కం॥ క్షమియింపు భీమ నాయక, కమల భవాద్య మరరాజ కాంచన
మకుటీ సముదయమణి ఘృణి రేఖా, కమనీయ పదాంబు జోప
కంఠోద్దేశా॥

కం॥ కావుము దక్షారామపు, రీవల్లభ భీమనాథ త్రిజగదధీశా
కైవల్యభోగ లక్ష్మీ, ప్రావీణ్యప్రదకటాక్షభక్తాధీనా!
భీమ 111 207, 208.

ఇట్లనేకవిధముల శివునియందు భక్తిభావములను భక్తులచే ప్రతి
పాదింపఁజేయుట మూలమున శ్రీనాథుఁడు తన శివభక్తి ప్రపత్తులను
వ్యక్తీకరించినాఁడని విశ్వసింపవలసియున్నది. మఱితన తప్పులను, తండ్రి
కుమారుని తప్పులను సైచునట్లు సైపుమని యిట్లు వ్యాసదేవేంద్రా
దుల ముఖమునఁ బలికింపఁజేయుచున్నాఁడు. వ్యాసుఁడిట్లు ప్రార్థించు
చున్నాఁడు శివుని.

కం॥ కృపగల్గి భీమనాయక, యపరాధముసైపు లేంద్రి వాదుమా కావో,
కృపగల్గి సుతుఁడు చేసిన,యపరాధముతండ్రిసైచు టర్హంబె కదా!
దేవత లిట్లీశ్వరుని స్తుతించిరి. భీమ 111 209.
తే॥ మమ్ము రక్షించి తని యేల మాటి మాటి, కభినుతింపఁగ దక్ష
వాటాధి నాథ,తల్లి దండ్రులు రక్షింపఁదలఁపరు,డె,ప్రజల భీమేశ
బహువిధోపద్రవముల. భీమ IV 79.

భీమఖండమునందే దేవేంద్రాదులును మహర్షులును శివునారా ధించినది యొక్క యెత్తును, వేదవ్యాసుఁడు శివునారాధించినది మఱి యొక యెత్తు. ఈకావ్యమునకు వ్యాసుఁడే నాయకుఁడని చెప్పవలయు నేమో యనునంత ప్రాధాన్యమున్నది, దీని నతనికి. ఇందు వ్యాసుని కథ మొదటినుండి చివరవఱకు వ్యాపించియున్నది. ఇతర విషయములు మధ్య మధ్య నుపాఖ్యానములుగా, ప్రాసంగికములుగా నున్నవి. అట్టి కావ్యప్రధాన పాత్రమగు వేదవ్యాసునిచే నతఁడు కాశిని శపింపఁబోవు టయును పాపమునకు ప్రాయశ్చిత్తముగ పశ్చాత్తాపబుద్ధితో ననేక విధములుగ దక్షారామ భీముని భక్తితో క్షమార్పణ వేఁడికొనఁజేసి నాఁడు. ఈ ఘట్టమున వ్యాసుని భక్తి ప్రతిపాదకమైన చర్యలును, స్తుతులును, ప్రార్థనలును నిరుపమానములుగ నుండి శివుని హృదయ మును గూడ యథార్థముగఁ గరగించెనని విశ్వసింపఁ జేయుచున్నవి. ఇటువంటి రచనలు శ్రీనాథుఁడు తన హృదయపుటమునుండి వ్యక్తీక రింపఁ జేసినవే యని భావింపఁదగినట్లున్నవి. కాని కేవలము కథా సందర్భమును బట్టి రచించినట్లుగ మాత్రము లేవు. ఈ భాగము భాగ వతమున పోతన రచనలను గూడ నతిశయించి, యతనికి మార్గదర్శక ములు గూడ నైనవి. చూడుఁడు, వ్యాసుఁడేరీతి శివుని స్తుతించు చున్నాఁడో.

సీ॥ శ్రీభీమనాయక శివనామధేయంబుఁ, జింతింప నేర్చిన జిహ్వ జిహ్వ,
దక్షవాటీపురాధ్యక్షు మోహనమూర్తిఁ జూడంగ నేర్చిన చూపుచూపు
దక్షిణాంబుధి తటస్థాయి పావనకీర్తిచే నింప నేర్చిన చెవులు చెవులు
తారకబ్రహ్మవిద్యాదాత పాదలవిరులు పూన్పఁగ నేర్చు కరము కరము
తే॥ ధవళకర శేఖరునకుఁ బ్రదక్షిణంబు, నర్థిఁ దిరుగంగ నేర్చిన యడుగు
లడుగు, లంబికానాయక ధ్యాన హర్ష జలధి, మధ్యమునఁ దేలి
యాడెడు మనసు మనసు. భీమ 111 198.

ఈ పద్యము సర్వవిధములఁ బోతన భాగవత సప్తస్కంధము
లోని ప్రహ్లాద చరిత్రయందలి పద్యమునకు మూలమనఁదగియున్నది.

సీ॥ కమలాక్షు నర్చించు కరములు కరములు, శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు, శేషశాయికి మ్రొక్కు
శిరము శిరము, విష్ణు నాకర్ణించు వీనులు వీనులు, మధువైరిఁ దవిలిన
మనము మనము, భగవంతు వలగొను పదములు పదములు, పురు
షోత్తముని మీఁది బుద్ధి బుద్ధి,
తే॥ దేవదేవునిఁ జింతించు దినము దినము, చక్రహస్తునిఁ బ్రకటించు
చదువు చదువు, కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు, తండ్రి హరిఁ
జేరు మనియెడు తండ్రి తండ్రి. భాగ-సప్తస్క-169.

ఇటువంటి పద్యములను వ్రాయుట చేతనే కదా పోతనార్యుని
హృదయము బహు పవిత్రత మైనదనియు, నిర్మల భక్తిభావముతోఁ
గూడికొనినదనియు మనము భావించుచున్నాము. అట్టి పద్యభావములకు
మూలపురుషుఁడును, మార్గదర్శకుఁడునైన శ్రీనాథుని హృదయము
మాత్రము తక్కువ భక్తి కలది యగునా? శ్రీనాథుఁడు పోతన కంటె
20, 30 సం.లు పూర్వుఁడనుట యందఱు నంగీకరించిన విషయమే.
శ్రీనాథుఁడు ప్రౌఢ నిర్భరవయఃపరిపాకమునఁ గదా భీమఖండమును
వ్రాసినాఁడు. కాన నావయస్సుననే శ్రీనాథుని హృదయమెంత భక్తి

భావములతో నిండియుండెనో యూహింపఁదగును. అట్టి శ్రీనాథుఁడు "దాక్షారామము, పలివెల, పీఠికాపురము......నా యీ స్థలములందనకు సమకూడిన యనుభవానందాదులు వెలికిఁదోచునట్టు పెక్కుపట్టుల కవనము రచించినాఁడు.... యౌవనము నిండారి ప్రౌఢమై నిర్భరమైన యీ కాలమందీతని నెన్నోయున్నత భోగములననుభవింపఁజేసినది" (శృంగార శ్రీనాథము పుట 145) అనియు, "భీమఖండ రచన కాలమునకే శ్రీనాథునకు దాక్షారామ రామాసమాగమాది సౌభాగ్యంబులు సంఘటిల్లినవి" (శృ. శ్రీ. పుట 151) అని వే. ప్రభాకర శాస్త్రిగారు వ్రాయుటయే కాక, క్రీడాభిరామ పీఠికలో 78వపుటయందు శృంగార శ్రీనాథ విమర్శకులఁ గూర్చి "పై విమర్శకులు శ్రీనాథుని నిష్కళంకమూర్తిని జూచిరఁట కాని, వాస్తవముగా నేనట్టి దానిఁ జూడలేకపోయితిని. లోకసామాన్యుఁడనయిన నేను నేఁటి కేనూతేండ్లకుఁ బూర్వమున్న శ్రీనాథునిమూర్తి నెట్లు చూడఁగలను ? ఆదివ్య దృష్టి నాకు లేదు. నేను లోకోత్తరుఁడనుగాను" అని హేళన పూర్వకముగ వ్రాసినారు.

భాగవతమున నిష్కల్మషులగు ప్రహ్లాదాదిభక్తులను వర్ణింప వలసివచ్చినది పోతనకు. భీమఖండమున మహాజ్ఞానియై, తనయహంభావదురహంకారములవలనఁబతితుఁడై, తిరిగి పశ్చాత్తాపము చెంది, భక్తిపూర్వకప్రాయశ్చిత్త మొనర్చుకొని, పరమేశ్వరానుగ్రహమును సంపాదించుకొనిన వేదవ్యాసుని వర్ణింపవలసివచ్చినది శ్రీనాథునకు. 'వ్యాసో నారాయణో హరిః' అనికదా ప్రసిద్ధి. అట్టిపతితుని పునరుద్ధరణకట్టిభక్తివిశేషము గావలయునో దానిని ప్రతిపాదించినాఁడు శ్రీనాథుఁడు. భీమఖండమునఁ బరమేశ్వరుని తండ్రిగా వ్యాసుఁడుచూచి, సంబోధించి ప్రార్థించినట్లు, పోతనగారి ప్రహ్లాదుఁడు విష్ణుని దండ్రిగా సంభావించి "తండ్రిహరిఁజేరు మనియెడు తండ్రితండ్రి" యనిపలికి

నాఁడు. ఇఁక వ్యాసుని పశ్చాత్తాప పూర్వక భక్తిప్రాయశ్చిత్తమును శ్రీనాథుఁడెట్లువర్ణించెనో చూతము. వేదవ్యాసుఁడు తన యహంకారము పరిత్యజించి పామరునివలె దక్షారామ భీమేశ్వరుని గొలిచినాఁడఁట. తానొనర్చిన తప్పునుగ్రహించి పరమేశ్వరుని సన్నిధానమున పిటికివాని వలె భయభక్తులతో మెలఁగినాఁడు. పూర్వము తాను కాశిని శపింపఁబోవునప్పటి దురహంకారమునకుఁ బ్రతీకారముగా నిది యొనరింపఁబడినది. దోషి శిక్షాకారియెదుట నెట్లు పశ్చాత్తాపముతో లజ్జాభిమాన రహితుఁడై క్షమార్పణ వేడుకొనునో యట్లు వ్యాసుఁడు శివునియెదుట నిలిచి శరణు వేడుకొనెను.

సీ॥ కరతాళకలన శంకరగీతములు పాడు, లజ్జాభిమానంబు లుజ్జగించి
III-192.

కం॥ బాలోన్మత్త పిశాచద, శాలంబనమునఁ జరించు నంగడివీథిన్.
ప్రీళాశూన్యతఁ గంతే, కాలునిపాదముల మీఁదఁగలుగు విరాళిన్.
III-193.

సీ॥ తాఁకించుకొను జటాస్త బకంబు విరియంగఁ,
బానపట్టముతోడ ఫాలతలము

. . . . . . . . . .

తే॥ కాశికాపట్టణద్రోహిఁ గావు మభవ.
విశ్వపతిదూషితునిఁ బ్రోవు విశ్వనాథ,
కల్లచేసితి రక్షింపు కాలకంఠ,
యనుచుఁబ్రార్థించు భీమనాయకునిఁ దపసి III-194

సీ॥ అఘముల కొండు ప్రాయశ్చిత్తములు లేవు,
నిన్నుఁ జూచుటకంటె నీలకంఠ,

. . . . . . . . . .

తే॥ శిష్యులును నేను మిమ్ముఁ గొల్చెదము భక్తి,
విశ్వపతికోపమునఁ గాశి వెడలివచ్చి
తరసి రక్షింపుమమ్మ దయార్ద్రహృదయ,
శాంతభీమేశ్వరేశ్వర స్వామినాథ! 195

స్రగ్ధర॥ కౌక్షింభర్యంబు దీర్పం గడుపున కిడుదుం గాలసంప్రాప్తభిక్షన్.
III-200.

తే॥ ధూర్జటికిఁ గాక భీమనాథునకుఁ గాక,
నిఖలకళ్యాణ కారుణ్య నిధికిఁ గాక
యన్యదైవంబులకు నేల యధికభక్తి,
సంఘటింతుఁ గరాంబుజాంజలిపుటంబు III-206.

మ॥ అనుచుం దాండవ మాడుచుండె శివభక్త్యావేశలీలార్భటి
న్మునిశార్దూలము దక్షవాటి నడుమ న్లోలజ్జటాభారుఁడై
వినిపించెన్ సశరీరభారతి నభోవీథీవిటంకంబునన్
నిను రక్షించెను భీమనాయకుఁడు కాసీనా! సుఖంబుండుమీ॥
III-213

ఇది వేదవ్యాసుని పశ్చాత్తాప తప్తహృదయ పూర్వకమైన భక్తి. మనోవాక్కాయములతో నంతరాత్మ శుద్ధితో వేదవ్యాసుఁడు పొందిన పరివేదనము. వ్యాసుఁడు మహాజ్ఞానికదా! చతుర్వేదములను విభజింప నేర్చినవాఁడు. మహాయోగి, తపస్వి. ఇట్టివానికి విశ్వనాథుని పరీక్షలో భక్తిజ్ఞాన వైరాగ్యములన్నియు నహంకారనశమునఁ బటాపంచలై పోయినవి. దాని ప్రాయశ్చిత్తముగా నాతని పశ్చాత్తాప పూర్వక యాత్మనిర్వేదము మనహృదయములతోపాటు పరమేశ్వరుని హృదయమును గూడ కరగించివేసి యతనిని రక్షింపఁజేసినది. ముగ్ధభక్తులైన ప్రహ్లాదాదుల భక్తిప్రతిపాదనము కంటె, పతితులభక్తి బహు

తీవ్రముగను, నాత్మపరిశోధన పూర్వకముగను ప్రతిపాదింపఁ బడినది. ఇందుచేతనే వారిపాప పంకిలము ప్రక్షాళిత మగును. ఇట్టి వర్ణనము శ్రీనాథునిచేఁ జిత్రింపఁబడినది. తన్మూలమున శ్రీనాథుని యాత్మీయత యాత్మభక్తి భావములు, నాత్మశుద్ధి ప్రకటింపఁ బడినవని నాయుద్దేశము. భక్తుల హృదయ కుహరములలోని యుత్కృష్టావేశములను గుర్తించుట భక్తులకే కాని యితరులకు సాధ్యము కాదని నాభావము.

భాగవతమందలి ప్రహ్లాదాది భక్తులు నిర్దోషులైన శుద్ధసాత్విక భక్తులు, పోతనగూడ వారివలెనే సత్వగుణము ప్రధానముగాఁగల భక్తిహృదయముగలవాఁడు. కనుకనే యట్టినిజ సదృశ భక్తుల చరిత్రములను హృదయంగమముగా జిత్రింపఁగల్గినాఁడు పోతన. వ్యాసుల వారు మహాజ్ఞాన వైరాగ్య సంపన్నుఁడైన తపస్వి. అటు విశేషించి రజోగుణ విరాజితుఁడైన మహాకవి. ఈయన స్వీయాహంకార దూషితుఁడై పతితుఁడైనాఁడు, కాని వెంటనే తనజ్ఞాన సంపదచేఁ తనతప్పును గ్రహింపఁగల్గినాడు. కాని,దక్ష హిరణ్యకశిపాదులవలెఁ దమోగుణావిష్టుఁడై భగవంతునిపై శత్రుత్వము వహింపక,పశ్చాత్తాపతప్తమానసుఁడై భక్తిప్రతిపత్తులచే నీశ్వరుని మెప్పించి, యాయన కరుణకుఁ బాత్రుఁడైనాఁడు. శ్రీనాథుఁడును మహాశాస్త్రజ్ఞాన విరాజితుఁడైన పండితుఁడై, మహాకవియై, రజోగుణాత్ముఁడై, ప్రాపంచిక మహారాజ భోగ్యభాగ్యములను రుచిచూచి, యనుభవించిన రసికుడును,రసజ్ఞుఁడు కాని విరాగి కాఁడు. జ్ఞానాజ్ఞానవివేకి, కార్యకార్యావివేచనపరుఁడు, కాని తమోవిలసితుఁడు గాడు. ఇతఁడు ప్రాపంచిక భాగ్య భోగానుభముల వలన నీషత్కలుషితమైన యహంకార హృదయమును, తన భక్తిజ్ఞానములచే సంస్కరించుకొనఁగల్గిన సమర్థుఁడు.అటువంటివాఁడు కనుకనే తనతో సదృశుఁడైన వ్యాసుని హృదయమును తగినట్లర్థము చేసికొనఁ

గల్గి యుచితరీతి నతని భక్తిని బ్రతిపాదించి,యతని చరిత్రను చిత్రింపఁ గల్గినాఁడు. అతనియందుఁ దనలోని సమానధర్మములు గొన్ని గోచరించినవి శ్రీనాథునకు. వ్యాసుఁడు కాశిని శపింపఁబూనుటచేతను శివునిచేఁ దిరస్కరింపఁ బడుటచేతను శివ ద్వేషియని యేలభావింపరాదో, భాగ్యభోగ్యముల నాశించి యనుభవించిన శ్రీనాథుని స్త్రీలోలుఁడని భావింపరాదు. తపస్వి,జ్ఞాని, విద్యావంతుఁడైన వ్యాసుఁడు కుక్షింభరిత్వమున లోభించి యేలపతితుఁడాయెనో, మహాకవి, పండితుఁడు, జ్ఞానియైన శ్రీనాథుఁడు మహాభోగము లనుభవించియు, వార్ధక్యమునఁగూడ వానికి లోపము గలుగకుండుటకై బొడ్డుపల్లి వ్యవసాయమునకుఁ బూనఁగ దైవదుర్విపాకమున కృష్ణ వరదరూపమున నార్థికపతనమువచ్చినది. ఇంత మాత్రముచే శ్రీనాథుఁడు స్త్రీలోలుఁడని ధనలోలుఁడని మనము భావింపరాదు. పోతన యెటువంటి విష్ణుభక్తుఁడో, శ్రీనాథుఁడటువంటి శివభక్తుఁడని తలంపవలయునే కాని వేఱుకాదు. పోతనవంటి సాత్త్వికుఁడును, విరాగియు కాకపోవచ్చును శ్రీనాథుఁడు. అంత మాత్రముచే శ్రీనాథుఁడు భక్తుఁడు గాదన వీలులేదు.ఇట్టిశివభక్తుని నకారణముగ స్త్రీలోలుఁడనుట సమంజసముగాదని నా భావము. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు రచించిన 'శ్రీనాథుఁడు శృంగారియా' యను గ్రంథమును చదివినమీఁదట నాకీవ్యాసమును వ్రాయ కుతూహలముగలిగి నాకుఁ దోఁచిన యభిప్రాయముల కీరూపము నొసంగితిని.

---

# వ్యక్తివివేకము

భాగవతుల కుటుంబరాయశాస్త్రి.

(గతసంచిక తరువాయి)

అర్థము :-నవచన్ద్రికా కుసుమ కీర్ణతమః కబరీ భృతః=క్రొత్త వెన్నెల యనెడి పూలతో వ్యాప్తమైన చీకటియనెడు కేశపాశముగల హరేః=ఇంద్రుని హరితః=దిశయొక్క, ముఖస్య=అగ్రభాగమనెడు ముఖస్య=ముఖము యొక్క లలాట తటహారి=నుదురువలె నందముగ నున్న, హిమరశ్మిదలమ్=చన్ద్రమండలము, మలయజార్ద్రమ్ ఇవ=గంధముతోఁ దడిసినదివలె దదృశే=కన్పడెను.

వివరణము:- ఇచట, చన్ద్రమండలమునందు మలయజార్ద్రత్వము ఉత్ప్రేక్షితమగుచున్నది. ఇట్లుత్ప్రేక్షించుటవలన, మలయజార్ద్రమ్ అనునది లలాట తటమునకు విశేషణముగఁ బర్యవసించునని కవి తాత్పర్యము. అట్లు కానిచో, చన్ద్రమండలమునందు మలయజార్ద్రత్వము నుత్ప్రేక్షించుటకు వేఱొక ప్రయోజనము లేదు. ఈ ప్రయోజనము ఇవ శబ్దము లేకున్నను సిద్ధించును మలయజార్ద్ర శబ్దము లలాట తటమునకు విశేషణముగ నన్వయించుట కివశబ్ద మక్కఱలేదు. ఔపమ్యమును చెప్పుటకు, "లలాటతట ఇవహారి" అను విగ్రహవాక్యమును చెప్పుట వలన, "లలాటతటహారి" యను సమాసమున, "ఇవ" శబ్దము గర్భీకృతమై యుండనేయున్నది. మొదట నున్న "ఇవ" శబ్దము పునరుక్తమనుట కంటె సమాసమున నున్న ఇవశబ్దము పునరుక్తమన రాదా ? యని ప్రశ్నింప వచ్చును. దానికి సమాధానమిది. 'ఇవ' శబ్దము లలాటతట శబ్దమునొద్ద నుండుట యుక్తము మలయజార్ద్ర శబ్దముదగ్గఱ నుండుట క్రమ విరుద్ధము-అందుచే లలాటతట శబ్దము తరువాత గర్భీకృతముగ నున్న ఇవ శబ్దమునే యుంచుకొని, మొదటి "ఇవ" శబ్దమే పునరుక్తమనుట యుక్తము. "దదృశే లలాటతట మిన్ద్రదిశో, వదనస్య హారి హిమరశ్మిదలమ్" అని సవరించినచో కొంతవఱకు మెఱుగుగ నుండును."లలాట తటహారి అని సమాసమును

చేయకుండుట వలన, హారి యను శబ్దమును విడిగా ప్రయోగించుట వలనను, ఇవ శబ్దార్థము స్ఫురింపదు. ఒక ఇవ శబ్దమే యుండుటచే ఇవశబ్ద పునరుక్తి పరిహృతమగును.

ఉదాహరణాన్తరము :-

వర్ణైః కతిపయై రేవ గ్రథితస్య స్వరై రివ

అనన్తా వాఙ్మయస్యాహో గేయస్యేవ విచిత్రతా

అర్థము :- కతిపయైః ఏవ, వర్ణైః = పరిమితములేయైన అక్షరముల చేత, (కతిపయై రేవ) స్వరైః ఇవ=(పరిమితములేయైన) స్వరముల చేతను వలె, గ్రథితస్య=కూర్పఁబడిన వాఙ్మయస్య=వాఙ్మయము యొక్క, విచిత్రతా=విచిత్రత, గేయస్య ఇవ=గేయము యొక్క (విచిత్రత) వలె, అనన్తా=అన్తము లేనిది. అహో=ఎంత యాశ్చర్యము. (అనేకోపమాలంకారము)

ఇందొక ఇవ శబ్దము చాలును. రెండవ ఇవశబ్దము పునరుక్తము "గేయస్య, వాఙ్మయస్యాహో అపర్యన్తా విచిత్రతా" అని కూర్చినచో నీ దోషము పోవును. ఇటులనే ఉపమారూపకమునందుఁ గూడ ఇవశబ్దప్రయోగము పునరుక్తముగఁ గన్పట్టుచున్నది.

ఉదాహరణములు :-

1. "నిర్మోక ముక్తిమివ గగనోరగస్య, లీలాలలాటికా మివ త్రివిష్టపవిటస్య"

అర్థము :- గగనమను నురగము యొక్క కుబుసమును విడుచుటవలె, త్రివిష్టపమను విటునియొక్క విలాసార్థమగు నుదుటియందలి బొట్టువలె

2. "శాతః శ్యామాలతాయాః పరశురివ, తమోరణ్యవహ్నేరివార్చిః"

అర్థము :- రాత్రియనెడు తీగెకు పదునైన గొడ్డలివలె, చీకటి యనెడు నరణ్యమున కగ్ని జ్వాలవలె. ఇచ్చట "ముక్తిమివ" "లలాటికా మివ" పరశురివ, అర్చిరివ అనునపుడు ఇవ శబ్దమును ప్రయోగించుటచే నుపమాలంకారము భాసించుచున్నది. ఇవ శబ్దమును ప్రయోగింపకున్నచో బాగుండెడిది. అపు డిచటఁగూడ రూపకాలంకారమే యుండెడిది. ఈ రూపక ముఖముననే యుపమ (సాదృశ్యము) భాసించెడిది. సాదృశ్యము లేనిదే బుద్ధిమంతుఁ డెవడును నొక వస్తువుపై మఱియొక వస్తువు నారోపింపఁడు గదా ! ఇట్లు రూపక ప్రయోగము చేతనే సాదృశ్యము స్ఫురించుచుండఁగా, ఇవ శబ్దమును ప్రయోగించుట పునరుక్తమే యగును. సాదృశ్యమున్నపుడే యారోపము కుదురు ననుటకు ఉదాహరణము.

శ్లో॥ ఆలానం, జయలక్ష్మణస్య కరిణః, సేతుర్వి పద్వారిధేః
పూర్వాద్రిః కరవాల చండమహసో, లీలోపధానం శ్రియః,
సంగ్రామామృత సాగర ప్రమథన క్రీడావిధౌ మన్దరః
రాజన్, రాజతి, వీరవైరి వనితా వైధవ్యద స్తే భుజః.

తా॥ ఓ రాజా శత్రుస్త్రీలకు వైధవ్యము నిచ్చు నీ భుజము జయమను ఏనుఁగునకు కట్టుకొయ్య,ఆపదలను సముద్రమునకు సేతువు, ఖడ్గమనెడు సూర్యునకు ఉదయపర్వతము,లక్ష్మికి విలాసార్థపుగు దిండు, యుద్ధమనెడు క్షీరసాగరమును మథించుటలో మన్దరపర్వతము.

వ్యాఖ్య:- ఇచట నన్నియు రూపకాలంకారములేయున్నను, భుజమునకు సేతువు, మన్దరపర్వతము మొదలగు వానికిని సాదృశ్యము భాసించుచునేయున్నది. ఈ సాదృశ్యము లేనిదే రూపక కల్పనమే సాధ్యము కాదు.

పునరుక్తదోషమునకు ఉదాహరణాన్తరము

శ్లో॥ అంగులీభిరివ కేశ సంచయం సన్నిగృహ్య తిమిరం మరీచిభిః
కుడ్మలీకృత సరోజలోచనం చుంబతీవ రజనీముఖం శశీ

అర్థము :- శశీ=చంద్రుఁడు, అంగులీభిః ఇవ, మరీచిభిః=వేళ్ళ చేతను వలె కిరణములచే, తిమిరమ్=చీకటియనెడు, కేశసంచయం=కేశసమూహమును, సన్నిగృహ్య=పట్టుకొని, కుడ్మలీకృత సరోజ లోచనమ్=ముడుచుకొనిన పద్మమనెడు నేత్రముగల, రజనీముఖమ్=రాత్రియొక్క ముఖమును, చుంబతి ఇవ=ముద్దుపెట్టుకొనుచున్నాఁడా యనునట్లున్నది.

ఇచట 'చుంబతి ఇవ' అనునపుడు ఉత్ప్రేక్ష వివక్షితము. అందుకై ఇవశబ్ద మువయుక్తమైనది. కాని యిచట, చంద్రుఁడు, రాత్రిముఖమును ముద్దిడుకొనుటయను వాచ్యార్థము బాధితమగుచున్నది. అందుచే చంద్రుఁడు రాత్రితో సంబంధము కలవాఁడగుచున్నాఁడు. అని లక్ష్యార్థమును చెప్పుకొనవలయును. ఈ లక్ష్యార్థమునుండియే "రాత్రికిని చంద్రునకును గల సంబంధము చుంబనము వంటిది" అను నర్థము సిద్ధించుచున్నది. ఇట్లు సిద్ధించుచుండగా తిరిగి, ఇవ శబ్దమును ప్రయోగించుట పునరుక్తమగుచున్నది.

వేఱొక యుదాహరణము

"స్మరహుతాశన మురుర్మర చూర్ణతాం
దధు రివామ్రవనస్య రజః కణాః,
నిపతితాః, పరితః, పథికవ్రజాన్
ఉపరి, తే, పరితేపు, రతో భృశమ్"

అర్థము :- ఆమ్రవణస్య=మామిడిచెట్లవనముయొక్క రజః కణాః=పుష్పాదికణములు, స్మరహుతాశన మురుర్మర చూర్ణతామ్=కామాగ్నియనెడు తుషాగ్ని చూర్ణమును, దధురివ=ధరించినవా యన్నట్లున్నవి-అతః=అందువలననే (ఊక నిప్పుయొక్క చూర్ణమగుట చేతనే) పరితః=అంతటను, ఉపరి=పైన, నిపతితాః=పడిన, తే=ఆరజః

కణములు. పథికవ్రజాన్=పాంథసమూహములను, భృశమ్=అధిక
ముగా, పరితేపుః= తపింపఁజేసినవి.

ఇచట "చూర్ణతామ్ దధుః" అని చెప్పినను చాలును-
మామిడి పూలయందలి రజః కణములు అగ్నికణముల చూర్ణమును
ధరించిన వనుటచేతనే పుష్పాదికిని, అగ్నికణములకును సాదృశ్యము
భాసించుచునేయున్నది. అందుచే 'ఇవ' శబ్దము పునరుక్తము.

ఉదాహరణాన్తరము :—

తృప్తియోగః పరేణాపి నమహిమ్నా మహీయసామ్
పూర్ణశ్చంద్రోదయాకాంక్షీ దృష్టాన్తోఽత్ర మహార్ణవః.

అర్థ :- మహీయసామ్ = గొప్పవారికి, పరేణ మహిమ్నా
అపి=అతిశయమైన మహిమచేఁ గూడ, తృప్తియోగః న=తృప్తియుం
డదు. పూర్ణః=పూర్ణముగనుండియు, చంద్రోదయాకాంక్షీ=చంద్రో
దయమును కోరు, మహార్ణవః=సముద్రము, అత్ర=ఈ విషయమున,
దృష్టాన్తః=దృష్టాన్తము.

ఇందు ప్రతివస్తూపమాలంకారమున్నది "పూర్ణః మహార్ణవః
చంద్రోదయమాకాంక్షతి" అని మాత్రమే చెప్పినను ప్రతి వస్తూప
మాలంకారము భాసించును. ఆ యలంకారమువలననే గొప్ప వారికిని
సముద్రమునకును సామ్యము భాసించుచుండఁగా,ఆసామ్యమును తెల్పు
టకై, దృష్టాన్తపదమును ప్రయోగించుట పునరుక్తదోషము కల్గు
చున్నది. ప్రతీయమానమగు నర్థము మనసున కుల్లాసమును కలిగించు
నంతగా, వాచ్యార్థము కలిగింపదు.

అందువలననే

"సంచారపూతాని దిగన్తరాణి కృత్వాదినాన్తే నిలయాయగన్తుమ్
ప్రచక్రమే పల్లవరాగతామ్రా ప్రభాపతంగస్య మునేశ్చధేనుః.

అర్థము :- పల్లవరాగతామ్రా=చిగురుటాకు యొక్క రంగు

వలె ఎఱ్ఱగా నున్న, పతంగస్య=సూర్యుని యొక్క, ప్రభా=కాన్తి, మునేః, ధేనుశ్చ=మహర్షి యొక్క ఆవును, దిగన్తరాణి=దిక్కుల యొక్క అవకాశములను, సంచారపూతాని కృత్వా=సంచారముచే శుద్ధమైన వానినిగాఁ జేసి, దినాన్తే=సాయంకాలమునందు నిలయాయ=(సూర్యకాన్తిపక్షమున) అస్తమించుటకు (ఆవు పక్షమున) ఇంటికి, గన్తుమ్=వెళ్ళుటకు, ప్రచక్రమే=మొదలిడెను. ఇచట రఘువంశకథ యను మహాప్రకరణము ననుసరించి, ఆవునకు ముఖ్య ప్రాకరణికత్వము కలదు. సూర్యకాన్తికి అముఖ్యమగు ప్రాకరణికత్వ మున్నది. ఈవిధముగ ప్రాకరణికమును అప్రాకరణికమునగు ధేను పతంగ ప్రభలకు రెంటికిని "ప్రచక్రమే" అను ఒకేపదము సంబంధించియున్నది. అందుచే నిందు దీపకాలంకారమున్నది. ఇందు, ప్రభకును ధేనువునకును సామ్యము సూచితమగుచునేయున్నది అందువలననే, కవి యిచట, "ప్రభేవ భానోః సురభిర్మహర్షేః" అని ఉపమాలంకారమును ఉపయోగించి, సాదృశ్యమును వాచ్యము చేయలేదు. వాచ్యార్థము కంటె ప్రతీయమానార్థమే, ఎక్కువ రమణీయముగ నుండునని భావించియే కాళిదాసమహాకవి యిట్లు రచించినాఁడు. ఇటులే యితరాలంకారముల విషయమునఁ గూడ గ్రహింపవలయును. ఈ విషయమునే యీ క్రింది సంగ్రహ శ్లోకము తెలుపును.

శ్లో॥ వాచ్యాత్ ప్రతీయమానోఽర్థః తద్విదాం స్వదతేఽధికమ్
రూపకాది రతః శ్రేయాన్ అలంకారేషు నోపమా"

(సంగ్రహశ్లోకము 39)

భావము :- సహృదయులగు వారికి వాచ్యార్థము కంటె ప్రతీయమానార్థమే, యెక్కువ రమణీయముగ నుండును. అందుచే నలంకారములలో ఉపమాలంకారము కంటె రూపకాలంకారమే మంచిది. పునరుక్తిదోషమునకు మఱియొక యుదాహరణము.

శ్లో॥ శిశిరకాల మపాస్య గుణోఽస్య నః
క ఇవ శీతహరస్య కుచోష్మణః,
ఇతి ధియాస్తరుషః పరిరేభిరే
ఘన మతో నమతోఽనుమతాన్ ప్రియాః”

అర్థము :- శిశిరకాలమ్ అపాస్య=శిశిర ఋతువును వదలి శీతహరస్య=చలిని పోగొట్టు, అస్య=ఈమాయొక్క, కుచోష్మణః=స్తనముల యుష్ణతకు క ఇవ గుణః=ఏమి ప్రయోజనము, ఇతి=అనెడు, ధియా=బుద్ధితో, అతః=ఇందువలన (ప్రియాః=ప్రియురాండ్రు), అస్తరుషః=పోయినరోషము కలవారై, నమతః=నమస్కరించుచున్న, అనుమతాన్=ప్రియులను, ఘనమ్=గట్టిగా, పరిరేభిరే=కౌఁగిలించుకొనిరి.

ఇచట-ఇతి శబ్దమునకు 'అని' అను నర్థమును చెప్పవచ్చును. అపుడీ “యితి” శబ్దమే హేత్వర్థమగును. ఇట్లు, ఇతి శబ్దమే హేతువును తెలుపుచుండఁగా ఆయర్థమునే తెలుపు, ధియా అతః అను శబ్దములు పునరుక్తములు.

విశేషవ్యాఖ్య :- మల్లినాథ వ్యాఖ్యలో, “అతః” అను శబ్దమునకు, “ఈ శిశిరకాలమునందు” అను నర్థమున్నది. ఈ యర్థమున నితి” శబ్దము పునరుక్తము కాదు.

ఇతి శబ్దప్రయోగమున్నపుడు ధియా, అను శబ్దమును ప్రయోగింపకున్నను, దానియర్థము స్ఫురించుచునే యుండును. ఉదా॥“అశ్వేతి విదుషిత, మనుద్రవతా స్వయమశ్వమ్” ఇచట “అశ్వేతి” అనునపుడు ఇతి శబ్దమున్నది. 'ధియా' అను శబ్దములేదు. లేకున్నను ఆ శబ్దముయొక్క యర్థము భాసించుచునే యుండును.

ఇట్లు, ఇతి శబ్దము వలననే హేత్వర్థము, పూర్వ వాక్యార్థము బోధ్యమానమగుచుండుటచే, కు “ఇతి ధియా స్తరుషః” అనుటకు బదులుగా “ఇతియతో స్తరుషః” అనియున్నచో బాగుండును.

వేఽశోకయుదాహృతి :-

"అః కిమర్థమిదం చేతః సతామంభోధి దుర్భరమ్
ఇతి మత్వేవదుర్వేధాః పరదుః ఖై రపూరయత్".

అర్థము :- సతాం=సత్పురుషుల యొక్క, ఇదం, చేతః= ఈ మనస్సు, కిమర్థం ఎందుకని, అంభోధి దుర్భరమ్=సముద్రమువలె దుర్భరముగనున్నది. ఇతి, మత్వా, ఇవ=అని తలచినవలె దుర్వేధాః= దుష్టుఁడైన బ్రహ్మ,వారి మనసును-పరదుః ఖైః=ఇతరులదుఃఖములతో అపూరయత్ =నింపెను. (అః=తెలియని యొక విషయము నిపుడు తెలిసికొంటినను భావమును తెల్పును.)

ఇచట పూర్వ వాక్యార్థమున కోపము సూచితము 'ఇతి' శబ్దము ఆకోపమును పరామర్శించును. తిరిగి ఆకోపమును పరామర్శించుటకే "మత్వా" అని ప్రయోగించుట, పునరుక్తిదోషమును కలిగించుచున్నది. అందుచే "ఇతి క్రుధేవ తద్వేధాః" అని సవరించుట మంచిది. మూలపాఠమునందు "దుర్వేధాః" అను శబ్దమునుఁడి బ్రహ్మయొక్క దుష్టత్వము వాచ్యమగుచున్నది. ఇచట అతికష్టముతో మాత్రమే పూరింపఁ దగిన మనసును పరదుఃఖములతో నింపినంత మాత్రమున బ్రహ్మను దుష్టుఁడనుట యుచితముగ లేదు. ఇట్లు అవాచ్యమగు, దుష్టత్వమును చెప్పుటచే అవాచ్యవచన దోషము వచ్చుచున్నది. సవరించిన పాఠమునందు దుర్ అనునది లేదు. కావున ఈ పాఠమున నా దోషము కూడ తొలఁగును.

కారక పునరుక్తిదోషము :—

క్రియకును కర్త్రాదికారకములకును నవినాభావ సంబంధమున్నది. అందుచే నొక వాక్యమున క్రియావాచక శబ్దప్రయోగమున్నపు డవశ్యము కర్త్రాదికారకములు భాసించుచునేయుండును. కావున, విశేషణ రహితముగా, తిరిగి కారకము నుపయోగించుట

పునరుక్తమేయగును. ఆకారకమునందే దీని ప్రికర్షను చెప్పఁదలచిన పుడు, విశేషణవాచక శబ్దమును, ప్రియోగింపవలయును. విశేష్య వాచక శబ్దప్రియోగము లేకుండ, విశేషణ వాచకశబ్దప్రియోగము సాధ్యముకాదు. అందుచే నట్టి సమయములందు, విశేషణవాచక శబ్ద మును ప్రియోగించుటకు వీలుగా, కారకమును ప్రియోగింపవచ్చును. అపుడు పునరుక్తిని దోషముగ గ్రిహింపఁగూడదు.

కర్తృకారక పునరుక్తి కుదాహరణము

శ్లో॥ పతితోత్పతితైః శత్రు శిరోభి స్సమరాంగణే
యః కన్దుకైరి వోచ్చండః క్రీడన్ శతృభి ర్వైక్షితః.

అర్థము :- యః=ఎవఁడు, సమరాంగణే=యుద్ధభూమియందు, పతితోత్పతితైః కందుకైరివ=పడిలేచుచున్న బంతులతోవలె (బంతు లను పోలిన) పతితోత్పతితైః శత్రుశిరోభిః=పడిలేచుచున్న శత్రు శిరస్సులతో,క్రీడన్—ఆడుకొనుచున్నవాఁడై,ప్రచండః=భయంకరుఁడై లోకైః— ప్రిజలచే, వ్యలోక్యత—చూడఁబడెనో.

వివరణము:-ఇచట వ్యలోక్యత యనునది క్రియావాచకశబ్దము. ఇచట నున్న విలోకనమను క్రియ, తత్కర్తయగు లోకమును భాసింపఁ జేయుచునే యుండును. అయినను "లోకైః" అను కర్తృవాచక శబ్దము ప్రియుక్తమైనది. అందుచే నిచట కర్తృకారక పునరుక్తి దోషము వచ్చినది.

విశేషణవాచక శబ్దము కూడ నున్నపుడు, కారకశబ్దప్రియో గము దోషావహము కాదు.

ఉదాహరణము :-

"జనైరజాతస్ఖలనైర్నజాతు,ద్వయేఽప్యముచ్యన్త వినీతమార్గాః"

ద్వయేపి=రెంటియందును, వినీతమార్గాః=శిక్షితమైన మార్గము గలవారు, అజాతస్ఖలనైః, జనైః—పతనమునొందని, జనులచే, జాతు= ఎప్పుడును, న అముచ్యన్త=వదలివేయఁబడలేదు.

ఇచట జనులు, కర్త. ఇది, అముచ్యన్త అను క్రియాపద ప్రయోగము చేతనే ప్రతీతమగుచున్నను, 'అజాతస్థలనైః' అను విశేషణ పదప్రయోగము కొంతకు ప్రయుక్తమైనది.

కర్మకారక పునరుక్తి దోషము

"ఉవాచ, దూతస్త మచోదితోపి గాం
నహీంగిత జ్ఞోఽవసరేఽవ సీదతి"

దూతః—దూత తమ్—అతనిని గుఱించి, గామ్—మాటను (వాక్కును) అవోచత్—పలికెను.

ఇచట పలికెను అనుటతోడనే, వాక్కును పలికెనని, వాగ్రూపమైన కర్మ భాసించుచునేయుండ, 'గామ్' అని తిరిగి ప్రయోగించుటచే పునరుక్తి సంభవించినది.

సవిశేషణమున కుదాహృతి

"శుచిస్మితామ్ వాచమ్ అవోచ దచ్యుతః" అచ్యుతుఁడు, శుచిస్మితామ్—స్వచ్ఛమైన చిఱునగవు గల, వాచమ్—వాక్కును, అవోచత్=పలికెను.

ఇచట 'వాచమ్' అనునది కర్మ. ఇదియును పునరుక్తమే అయినను 'శుచిస్మితాం' అను విశేషణవాచకశబ్దము, వాక్కునందలి ప్రకర్షమును తెలుపుట కుపయుక్తమైనది. ఇపుడు విశేష్య వాచకమైన "వాచమ్" అను శబ్దము పునరుక్తముకాదు. స్మితపూర్వాభి భాషిత్వ మొక గుణముగా పరిగణితమగు చుండుటచే నిచట నీ విశేషణము విశేష్యమున కతిశయాధాయకమైనది.

కరణకారక పునరుక్తి కుదాహరణము

శ్లో॥ యదా దృశా కృశాంగ్యాస్మి దృష్టోఽజాతం తదైవ మే
ప్రజాగర గదగ్రస్త సమస్త ప్రసరం మనః.

అర్థము :- కృశాంగ్యా—స్త్రీ చేత, దృశా—కంటితో యదా

దృష్టః-ఎప్పుడు చూడఁబడితినో, తదా ఏవ= అప్పుడే మే, మనః = నా యొక్క మనస్సు, ప్రజాగర, గర, గ్రస్త, సమస్త ప్రసరం = నిద్రలేమి యనెడు విషముచే ఆక్రమింపఁబడిన సమస్త ప్రసరము గలిగి నదిగా, జాతమ్= అయినది. చూచుట యను క్రియకు, కన్నే సాధనము దృష్టః అనుటతోడనే 'దృశా' యను పదము ప్రతీతమగుచునే యుండును. అయినను 'దృశా' అనుపదము ప్రయుక్తమైనది. కావున కరణకారక పునరుక్తి యిచట నన్నది.

సవిశేషణకారకమున కుదాహరణము

"తం విలోక్య సురసుందరీజనో
విస్మయస్తిమిత తారయా దృశా"

"సురసుందరీ జనమతనిని, ఆశ్చర్యముచే, స్తిమితమైన కనుగ్రుడ్డు గల కంటితో చూచి" అని యీ వాక్యమున కర్థము. "విస్మయస్తిమితమైన తారగల" అను విశేషణ మిచటనుండుటచే 'దృశా' యనునది పునరుక్తము కాదు.

ఈ విధముగనే మిగిలిన కారకముల విషయముఁ గూడ నూహింపవలయును.

"ఏకైవాలంకృతి ర్యత్ర శాబ్దత్వార్థత్వ భేదతః
ద్విరుచ్యతే తామ్ మన్యన్తే పునరుక్తి మితిస్ఫుటామ్" (40)

ఒకే యలంకారము 'యథా' 'ఇవ' అను శబ్దములను ప్రయోగించుటచే, శాబ్దముగను, సదృశాది శబ్దముల నుపయోగించుటచే ఆర్థముగను, రెండు పర్యాయములు భాసించుచో, నపుడును పునరుక్తి యున్నట్లు స్పష్టముగ గ్రహింపవచ్చును.

ఉదా :-

> ఉమా వృషాంకౌ శరజన్మనా యథా
> యథా జయన్తేన శచీపురన్దరౌ
> తథా నృపః సాచ సుతేన మాగధీ
> ననందతు స్తత్సదృశేన తత్సమౌ.

అర్థము :- ఉమా వృషాంకౌ = పార్వతీపరమేశ్వరులు, శరజన్మనా = కుమారస్వామిచే, యథా, ననన్దతుః = ఎట్లు సంతోషించిరో, శచీపురన్దరౌ = శచీపురన్దరులు, యథా = ఏవిధముగా, జయన్తేన = జయన్తునితో, ననన్దతుః = సంతోషించిరో, తథా = అవిధముగా తత్సమౌ = పార్వతీ పరమేశ్వరులతోను, శచీపురన్దరులతోను, సములగు, సా, మాగధీ = ఆ సుదక్షిణ, నృపశ్చ = దిలీపుఁడును తత్సదృశేన = కుమారస్వామి, జయన్తులతో సమానుఁడగు, సుతేన = కుమారునితో, ననన్దతుః = సంతోషించిరి.

ఇచట "శరజన్మనా యథా" "యథా జయన్తేన" అను ప్రయోగముల చేతనే ఉపమానోపమేయభావము ప్రతీతమగుచున్నది. అయినను, "తత్సదృశేన "తత్సమౌ" అను పదములచే తిరిగి ఆయుపమానోపమేయ భావము ప్రతిపాదితమగుచునేయున్నది. అందుచే నిట పునరుక్తిదోషము సంభవించినది.

> "యస్య యదూహితావ్యక్తిః సామర్థ్యాదేవ జాయతే
> తస్యోపమా, రూపకం, వాతదర్థం పౌనరుక్త్యకృత్" (4)

భావము :- ఒక వస్తువు యొక్క విశేష స్వరూపము, లింగము విశేషణము, శ్లిష్టపదముల యొక్క సామర్థ్యము వలన స్ఫురించుచుండఁగా, ఆవిశేషరూపమును భాసింపఁజేయుటకే, ఉపమాలంకారమును గాని, రూపకాలంకారమును గాని యుక్తరయోగించుట పునరుక్తిదోషమగును.

ఉదాహరణము :-

శ్లో॥ స్ఫురదధీర తడిన్నయనా ముహుః
ప్రియమి వాగలితోరుపయోధరా
జలధరావలి రప్రతి పాలిత
స్వసమయా, సమయా జ్జగతీధరమ్.

అర్థము :- ముహుః = మాటి మాటికి, స్ఫురదధీర తడిన్నయనా = ప్రకాశించుచున్న, చంచలములగు నేత్రములవంటి మెఱపులు గలిగి నట్టియు, అగళితోరుపయోధరా = శూన్యముకాని (జలముతో నిండిన) పెద్ద మేఘములు గలట్టియు, (జారిపోని, ఊరువులు = తొడలు, పయోధరములు = స్తనములు కలిగినట్టియునని రెండవ యర్థము.) జలధరావళిః = మేఘపంక్తి, అప్రతిపాలిత స్వసమయా = తన కాలమును నిరీక్షింపకయే (తన సంకేత సమయము కాకమునుపే అని రెండవ యర్థము) జగతీధరమ్ = రైవతక పర్వతమును, ప్రియమివ = ప్రియునివలె, సమయాత్ = పొందెను.

తాత్పర్యము :- రైవతక పర్వతమున ఋతువులన్నియు నొక్క పర్యాయము అవతరించినవి. ప్రస్తుత పద్యమున, వర్షర్తువు యొక్క యవతరణము వర్ణితమగుచున్నది. మేఘపంక్తి రైవతక పర్వతమును పొందినది. అనునది ప్రధానభావము "స్ఫురదధీర తడిన్నయనా" "అగలితోరుపయోధరా" అనునవి జలధరావళికి విశేషణములు "జలధరావలి" "తడిన్నయనా" "ఉరుపయోధరా" అను శబ్దములు స్త్రీలింగమునందున్నవి. అగలితోరుపయోధర శబ్దమునకు విగ్రహ వాక్యమును రెండు విధములఁ జెప్పవచ్చును. (1) అగలితాః ఉరు పయోధరాః యస్యాం సా-"ఇచట ఉరు = పెద్ద, పయోధరాః = మేఘములు కలవి యని యర్థమును చెప్పవలయును. ఈ యర్థము జలధ

రావళికి సంబంధించినది (2) ఊరూచ, పయోధరౌచ ఊరుపయోధరం తొడలు, స్తనములు అగలితం, ఊరుపయోధరం, యస్యాం సా-ఇచట అగలితమైన, తొడలు, స్తనములు. కలది యనునర్థము స్ఫురించుచున్నది. ఇది నాయికకు సమన్వయించు నర్థము. స్ఫురదధీర తడిన్నయనా, అనునపుడు, నేత్రములవంటి మెఱపులని చెప్పుటచే, నాయికయొక్క చంచలములగు చూపులు గోచరించుచున్నవి. "అప్రతిపాలిత స్వసమయా" (1) అన్ని ఋతువులును ఒకే పర్యాయము వచ్చుటచే వర్షర్తువు తనకాలము, రాకమునుపే యవతరించినదని భావము (2) సమయమనగా, సంకేతసమయము. నాయిక తన ప్రియునితో, నొక ప్రత్యేక సమయమున, సంకేతస్థానమునకు వచ్చునని పూర్వము చెప్పినది కాని, ఆకాలము సమీపించు వఱకును ఆగలేకపోయినది. అందుచే నాయిక, సంకేతసమయమునకు ముందుగనే, సంకేతస్థానమునకు వచ్చినది. అని నాయికాపక్షమున నర్థము. ఇచట "జలధరావళీ" శబ్దము స్త్రీలింగమున నున్నది. జగతీధర శబ్దము పుమ్‌లింగమున నున్నది. ఈ లింగమహిమ వలనను, పైని వివరించిన శ్లేషవశమునను అప్రస్తుతమగు నాయికానాయక వృత్తాన్తము స్ఫురించుచున్నది. అందుచే నిచట సమాసోక్త్యలంకారమున్నది. ఈ సమాసోక్త్యలంకార నిబంధనము వలననే, జగతీధర జలధరావళులకు, ప్రియ ప్రణయినీతుల్యత్వము భాసించుచుండఁగా, తిరిగి జగతీధరమును "ప్రియమివ" అను పదప్రయోగముచే ప్రియునితోఁ బోల్చి యుపమాలంకారమును కూర్చుట పునరుక్తమే యగుచున్నది.

మఱియొక యుదాహరణము

"నిద్రావశేన భవతా హ్యనవేక్షమాణా
పర్యుత్సుకత్వ మబలా నిశి ఖండితేవ.

లక్ష్మీర్వినోదయతి యేన దిగన్తలంబీ
సోఽపి త్వదాననరుచిం విజహాతి చన్ద్రః"

అర్థము :-నిద్రావశేన = నిద్రకధీనుఁడైన (అన్యస్త్రీయందు సక్తుఁడైనాఁడను భావము ధ్వనించుచున్నది) భవతా = నీచేత (ఇచట సప్తమ్యర్థమున తృతీయ వచ్చినది. అందుచే నిద్రావశుఁడవగు నీయందు అను నర్థమును చెప్పుకొనవలయును) పర్యుత్సుకత్వమపి = అనురక్తత్వమును పైతము, నిశి = రాత్రియందు ఖండితా, అబలా ఇవ = ఖండిత యను నాయికవలె-(భర్త వేఱొకస్త్రీయందు సక్తుఁడైనాఁడని తెలిసి కోపము తెచ్చుకొనిన స్త్రీ, ఖండితయనఁబడును) అనపేక్షమాణా = విచారింపనిదై, (ఉపేక్షించుచున్నదై యని భావము) లక్ష్మీః = లక్ష్మి యేన చంద్రేణ సహ = ఏ చంద్రునితో వినోదయతి = వినోదము చేయుచున్నదో, సః, చన్ద్రః అపి = ఆ చంద్రుఁడు కూడ, దిగన్తలమ్బీ = పడమట దిక్కును పొందినవాఁడై, త్వదాననరుచిమ్ = నీముఖసాదృశ్యమును, విజహాతి = విడుచుచున్నాఁడు.

తాత్పర్యము:-వందిమాగధు లుషఃకాలమున అజమహారాజును మేల్కొలుపుచున్నారు చన్ద్రుఁడు, అరవిన్దము, రాజవదనము-మొదలగునవి, లక్ష్మికి నివాసస్థానములను ప్రసిద్ధి ననుసరించి యీపద్యభావమును కవికూర్చినాఁడు. లక్ష్మి అజమహారాజముఖము నాశ్రయించియున్నది. ఆయజుఁడు నిద్రించుచున్నాఁడు. అనఁగా నిద్రాకాంతకు వశుఁడైనాఁడు. తన భర్తయగు అజుఁడిట్లు అన్యస్త్రీసక్తుఁడగుటను తెలిసికొనిన, లక్ష్మి ఖండితానాయికవలె ఆగ్రహించినది. విరహబాధనొందినది. తనకును అజునకును నింతకుఁ బూర్వమున్న యనురాగమునైనను విచారింపలేదు విచారింపకయే, అజుని ముఖమును పోలిన చంద్రునితో వినోదించుచున్నది. ఆచంద్రుఁడు కూడ నిపుడ స్తమింపనున్నాఁడు. అందుచే నిపుడు లక్ష్మి నిరాశ్రయకానున్నది. కావున, నీవు నిద్రలేచి యనన్యశరణయగు లక్ష్మిని పరిగ్రహింపుమని భావము.

పై పద్యమున "భవతా హ్యనవేక్ష్యమాణా" అని వేఱొక పాఠము గలదు. ఆ పాఠము ననుసరించి.

నిద్రావశేనభవతా అనవేక్ష్యమాణా=నిద్రావశుఁడవైన నీ చేత చూడఁబడనిదై లక్ష్మీః= లక్ష్మి, యేన చంద్రేణ = ఏచంద్రునిలో, పర్యుత్సుకత్వమ్ = విరహావేదనను వినోదయతి = పోఁగొట్టుకొనుచున్నదో-అను నర్థమును చెప్పుకొనవలయును.

వ్యాఖ్య :- ఇచట "నిద్రావశేన" అనునపుడు నిద్రాశబ్దము స్త్రీలింగమున నున్నది. ఆ స్త్రీలింగ మహిమచే, అజుఁడన్యస్త్రీసక్తుఁడైనాఁడను భావము ధ్వనించుచున్నది. అజుఁడు నాయకుఁడు, నిద్ర లక్ష్మి నాయికలు, నిద్రాసక్తుఁడైన, యజుని జూచి, లక్ష్మి, చంద్రునితో వినోదించుచున్నదని చెప్పుట చేతనే, లక్ష్మికిని ఖండితనాయికకును గల సాదృశ్యము భాసించుచునే యుండును.

ఇట్లు, సమాసోక్తి వలననే ఖండితనాయికా వృత్తాంతము స్ఫురించి, లక్ష్మి ఖండిత నాయికా సాదృశ్యము భాసించుచుండఁగా, "ఖండితేవ" అని ప్రత్యేకముగ నుపమాలంకారము నుపయోగించుట పునరుక్తమే యైనది.

వేఱొక యుదాహరణము

"సురభి సంగమజం వనమాలయా
నవపలాశమధార్యత, భంగురమ్
రమణదత్తమివార్ద్రనఖక్షతమ్
ప్రమదయా, మదయాపిత లజ్జయా"

అర్థము :- మదయాపిత లజ్జయా = మదముచే పోఁగొట్టఁబడిన సిగ్గు గల, ప్రమదయా = స్త్రీ చేత, రమణదత్తమ్ = ప్రియునిచే నీయఁబడిన, ఆర్ద్రనఖక్షతమివ = క్రొత్తనఖక్షతమువలె, వనమాలయా = వనపంక్తిచేత, సురభి సంగమజమ్ = వసంతర్తువుయొక్క సంగమము వలనఁ గలిగిన, భంగురమ్, నవపలాశమ్ = కుటిలమగు చిగురుటాకు, అధార్యత = ధరింపఁబడెను. (సశేషము)

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

శాశ్వతికాధ్యక్షులు

విమర్శకాగ్రేసర ఐతిహాసిక సమ్రాట్టు

శ్రీ బండారు తమ్మయ్య

ప్రధాన కార్యదర్శి, కోశాధికారి

శ్రీ దంటు భాస్కరరావు

సహాయ కార్యదర్శి

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి

కార్యనిర్వాహక సభ్యులు

1. శ్రీ కోట శివనాథశాస్త్రి
2. శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి (బాలవ్యాస)
3. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి (వ్యాకరణ విద్వాన్, భాషాప్రవీణ)
4. శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి (కవిమూర్ధన్య, పౌరాణికకవిచంద్ర)
5. శ్రీ యండమూరి వేంకటరమణ (మధురకవితావిశారద)
6. శ్రీ కుందూరి ఈశ్వరదత్తు
7. శ్రీ జయంతి బుచ్చిరామశర్మ
8. డాక్టరు శ్రీ ఇవటూరి జోగారావు, (యం. బి. బి. యస్.,)
9. శ్రీ చిరువోలు కోటీశ్వరరావు
10. శ్రీ దామెర రాజగోపాలరావు, బి. ఏ.
11. శ్రీ వేదుల రామచంద్రకీర్తి, బి. ఏ. (ఆనర్సు)
12. శ్రీ ఓలేటి సుబ్బరాయశాస్త్రి (ఉభయభాషాప్రవీణ)
13. శ్రీ కావలి శ్రీరామమూర్తి, బి. ఏ., బి. ఎల్.

పత్రికా సంపాదకుడు

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణములు

## శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | | |
|---|---|---|
| 1వ సంపుటము | .... | రు 6—0—0 |
| 2వ సంపుటము | .... | 6—0—0 |
| 3వ సంపుటము | .... | 6—0—0 |
| 4వ సంపుటము | .... | 6—0—0 |
| 5వ సంపుటము | .... | 10—0—0 |
| 6వ సంపుటము | .... | 10—0—0 |
| 7వ సంపుటము | .... | [ముద్రణములో నున్నది] |

## కవిజనాశ్రయము

వేములవాడ భీమకవి విరచితము.

పెక్కు పాఠభేదములతోఁ గూడిన వెనుకటివిషయ మంతయుఁ గలిగి తిరిగి తృతీయముద్రణపీఠికతో ముద్రితమైనది. వెల రు 1—50.

## మాధ్యమిక కారికలు

బౌద్ధాచార్య నాగార్జున ప్రణీతము. కొల్లూరు సోమశేఖర శాస్త్రి విరచిత సుబోధినీవ్యాఖ్యాసహితము. మూల్యము. రు 2—.50

ఆంధ్రసాహిత్యపరిషత్తు,

కాకినాడ.

Printed by J. Gopalam, B.A. L.T., at Republic Press, Kakinada
Edited by **C. PAPAIAHSASTRY**
Published by Andhra Sahitya Parishat, Kakinada.